# గీతా ప్రతిభ



ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# గీతా ప్రతిభ

విద్వాన్
శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి



ప్రకాశకులు :
సాధన గ్రంథమండలి, తెనాలి.

 [వెల : రు. 2-00

10047

# గీతా గీత

గ్గీత అనగా గీత భగవద్గీతయే గీత. ఇతరగీతలు గీతలు. దీని ఛాయారూప ధేయములు. గీతార్థము సుగమము దుర్గమమును. గీతార్థము ఉపనిషదర్థము ఒకటి. ఇది బాదరాయణ సూత్ర సమ్మతము. మనసులో నున్న సంప్రదాయార్థమును గీతాసమ్మితము చేయుటకు ప్రాచీన సాంస్కృతికులు నానాపథములు ప్రకాశింప జేసిరి. అధునాతనులు నుపేక్షింపదలచ లేదు. గీతామోద మున్నగాని తమ భావములను లోకము మూ చూడదని వారి వారి ఊహ.

నేటి ప్రపంచములో సభ్యభాష గీతానువాద వ్యాఖ్యలతో ఆత్మభూష కలదయినది. భారతభాష లన్నియు గీతావాసితము లయినవి. తెలుగునాడు గీతకు గీత పెట్టక తన నొసట గీతగీత నుంచుకొనుట ధన్యరేఖ.

గీతాప్రశస్తి బహుముఖము కాదు, సర్వతోముఖము. పురాణములు ఉపపురాణములు గీతాభినందనము చేసినవి. వానిలో పద్మపురాణప్రఖ్య అవి స్మార్యము. గీత అష్టాదశాధ్యాయిని. పాద్మము పదునెనిమిది అధ్యాయము లలో అష్టాదశాధ్యాయినీ ఫల సంకీర్తనము ప్రదర్శించినది. ఆ నిరుక్తమే శ్రీ ప్రకాశశాస్త్రి రూపిత "గీతాప్రతిభ."

సహృదయుడు సర్వమిత్రుడు శ్రీకలగర నాగభూషణం చౌదరి సుహృదయతా చిహ్నముగా ఈ "ప్రతిభ" ఏలూరు "శ్రీ సాయిసుధ," పత్రికలో ప్రకటితము; పాఠకుల కనుభూతమును. తెనాలి సాధన గ్రంథ మండలి గీతాపూజలో సూర్యప్రకాశశాస్త్రి 'ప్రతిభ' ను పుష్టికరించినది. భావుకపఠిత లామోదసంవాద మనుభవింతురేని శాస్త్రికృతము కృతము.

శ్రీపాద్మములోని ఫలశ్రుతి, కథాఖ్యానగాథాదిరూపము. వానిని సామాన్యముగా మనభాషలో కథ లందుము. ఈ కథలకు స్వార్థతాత్పర్యము కలదా? చారిత్రక ప్రసిద్ధియున్నదా? గీత నెల్లేని యందరిచే నధ్యయనింప చేయవలయునని ఈ కథ లర్థవాదత్వము పొందెనా? కథాద్వారముననగాని యుపదేశ్యమున విశ్వాస ముదయింపదని యా రచయిత భావించెనా? అని సందిహానులకు కలుగు సంశతిమతి.

గీత సప్తశతి. అది విశిష్టమగు మహామంత్రము. మంత్రశక్తి కెన్నడును వినాశము లేదు. మంత్రశబ్ద మొకపేని యొకప్పుడేని యుచ్చరితము; కాని యది మహావీణాతంత్రీ నిక్వాణమై స్వరకాలము నసించును. ఆ నాదము ప్రాణికంతర్నాదానుగతమై విశ్వశక్తులకు విస్ఫురణము కలిగినపుడు ఉచ్ఛూనమై యనుభూతి కందును అట నట నుండు ఆ యనుభూతులను విశ్వమయ విశ్వాతిగ దృష్టి గల మహాప్రమాత గుర్తించి పొదుపును. అట్లు పొదుపు పొందిన విశేషములే ఈ కథలు,

ఇవి కథలో కథ, కథలో కథగా ఉచితము లయినవి. ఇందు పాఠాంతరములు రూపాంతరము లుండవచ్చును. అన్నియు సంభావ్యములు. వీనిలో ఒక వర్గమునకు సంబంధించిన విశిష్టతలే కాక సర్వవర్గీణములును కలవు, మానవములే కాదు, అమానవములును కలవు. వీని నమ్ముట ఎట్లు? అనుకొన నక్కరలేదు. బౌద్ధుల జాతకకథలు అవధాన కధలు ఈ దృశములెన్నియో కలవు. ఆ భారతీయులును ఇట్టి చిట్టి పొట్టి కథలం దాదృతమతులై యున్నారు. అయితే వారు వానిలో వాస్తవికతను చూడరు. గూఢమయిన ఆదర్శము నన్వేషింతురు. నిందా స్తుతులకు కథ లాయుధములని వారి భావన. భూతాత్మ భూతభావనుని భావించు భూతకోటి యోగ్య పరిణామమును పొందునన్న విశ్వసత్యము పాద్మ కథలలో నున్నది. పాపము పోవుట, పుణ్యము లభించుట కథలలో కన్పడును. ఇందు హేతువు

గీతాపారాయణము. సంప్రదాయప్రసిద్ధి కల సద్గురువు సమక్షమున సమప దేశము పొందుట ఇందు ముఖ్యనిర్దిష్టము. గీతాప్రతిభ ఈప్రరోచన మును సంపాదింప గలదు.

ఈదృశ మహాత్మా ప్రభావితు డయిన బులుసు సూర్యప్రకాశ శాస్త్రి గీతాఫలశ్రుతి నిట్లందించుటను హార్ధముగా హర్షింతును గీతపై కోరిక లెన్నియో కలవు. జాపకులు ఇతోధిక శ్రద్ధను గీతా మంత్రముపై ప్రసరింప జేయుట యవసరము. అది విశ్వశాంతి.

గీతోపదేశము విశదముగా నేటికిని, ప్రబంధీకృతము కాలేదు. సహృదయమిత్రుడు సాహితీసమితి సామితేయుడు శ్రీ గట్టి లక్ష్మీనర సింహ శాస్త్రి, శంకరపథము ననుసరించి గీతా ప్రబంధ ముదాత్తముగా చేయదలచుట పాఠక తపఃఫలము. యోగవాసిష్ఠములోని అర్జునగీత గీతా ప్రతిబింబము. అదియు సర్గబంధమై రావలయును. సాధనగ్రంథమండలి సంకల్ప వాహినికి బులుసు వారి కృషి ఒక ప్రణాళిక. ఇది సాధకుల కాత్మ ద్వారము.

గణేశ చతుర్థి
శాలి గంగూల
50
1924

జమ్ములమడక మాధవరామశర్మ.

# అభిప్రాయము

## శ్రీ చిరంతనానందస్వామివారు

(సంపాదకులు, రామకృష్ణప్రభ)

శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారిచే అనువదింపఁబడిన "గీతా ప్రతిభ" ను స్థాలీపులాకముగ పఠించి సంతసించితిని. పద్మ పురాణాంతర్గత మగు 'గీతామాహాత్మ్య' మిందు వివరింపఁబడియున్నది.

స్వధర్మ నిష్ఠా ప్రబోధకమయ్యు స్వమత దురభిమాన తిమిరమునకు సూర్యోదయప్రాయమై, సర్వమతసామరస్య నిలయమగు తత్త్వగ్రంథ రాజము మతవాఙ్మయప్రపంచమున భగవద్గీతను మించినది — ఏల? దీనితో తుల్యమగునది — వేఱొండు లేదు. నేఁటి మతకలహములకును కార్పణ్యములకును రక్తపాతములకును మూలకారణము సరియగు రీతిని గీతా ప్రచారము కావింపకుండుటయే కాని మఱియొకటి కాదు.

గీతార్ణవమందలి తాత్త్విక వేదాంతరత్నములను శ్రీ శంకర రామానుజాది భాష్యములును శ్రీ తిలక్ గీతారహస్యాదులును విశేషముగా విద్యావంతులకు అందింపఁజేయఁజాలియుండ ఈ 'గీతా ప్రతిభ' జనసామాన్యమునకు గీతా పారాయణ ఫలమును కథారూపమునఁదెలుపఁ గలిగియున్నది.

ఇందలి శైలి చక్కఁగనే యున్నను, అందందుఁ గానవగు వ్యాకరణ స్ఖాలిత్యములు పుస్తకమునకు న్యూనతనాపాదింపవని తలంతును. "నైవ వ్యాకరణజ్ఞ మేవ పితర"మ్మను మహాకవివాక్య మమోఘము కదా! వీరిట్టి గ్రంథముల ననేకము రచించి యితోధిక భాషా మత సేవలను జేయ శ్రీ రామకృష్ణభగవానుఁడు వీరికి చిరాయురారోగ్యాదులను ప్రసాదించుఁగాక!

శ్రీరామకృష్ణమఠము
మైలాపూరు, చెన్నపురి
21—10—1947

(సం) చిరంతనానందస్వామి

—*—

# అ భి ప్రా య ము లు

శ్రీ జగద్గురు వేదాన్తాచార్య సార్వభౌమ
ఉపన్యాస రత్నాకర, పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీ ౧౦౮ నిత్యానందేంద్ర సరస్వతీ స్వాములవారు
(ఉపనిషత్స్వాములవారు)

ఉ ప ని ష ద్గీ తా వి హా ర్

"గీతా ప్రతిభ" చేరినది. చదివి చూచినాను. భగవద్గీతయందభిరుచియు, ప్రామాణ్య బుద్ధియు ప్రతి నిత్యము చదివి పారాయణ చేయవలెనను శ్రద్ధా భక్తులున్నూ కలుగుచున్నవి. చాల బాగుగ నున్నది.

కాకినాడ — అనేక నారాయణ స్మరణలు
15-9-47 — (సం) శ్రీ ఉపనిషత్స్వామి



గీతాప్రతిభ కొన్ని పుటలు ప్రత్యక్షర శోధగా చదివితిని. సులభ శైలిలో ఆబాల గోపాలముగా నక్షరాస్యు లందరును బఠించి భక్తి జ్ఞాన వైరాగ్యములను సంపాదించు కొనుటకు నొక సోపానముగా నున్నది. కేవలము వ్యావహారికమని వ్యావహారిక భాషయుగాదు. గ్రాంధికమని గ్రాంధిక భాషయును గాదు. శిష్ట మహాజనుల భాషలో హృద్యముగా రచించిన మీ పరిశ్రమ సర్వధా అభినందనీయ మని నేను సంతసించు చున్నాను. ఇది పద్యాత్మకంగా రచించినచో మీరెంత జాగ్రత్తగా రచించినను యతికొఱకును ప్రాసకొఱకును కొన్ని వ్యర్థపదములు( పడికట్టు రాళ్ళు) దొరలకుండెడి వికావు, ఇప్పుడో అట్టిది యొక అక్కఱరము కూడ

దొరలనే లేదు. అని సప్రతిజ్ఞముగా చెప్పఁదగిన మీరచన నెల్లరును అభి నందింతు రని నాభావము. మీ వచన రచనలో నూటికి నేయొక పదమో తప్ప సర్వమును గ్రాంధిక మయమే. కావుననే యిద్దానిని శిష్టమహాజన భాషయంటిని. గీతాకర్తయగు శ్రీ కృష్ణభగవానుడు మీ భక్తికి మెచ్చి మీకు నితోధికంగా సద్గ్రంధ రచనకు ప్రోత్సాహ మొసగి శ్రేయః ప్రదాతయై యిహపరముల ననుగ్రహించి రక్షించుఁగాక. స్వస్తి.

క్షీరసాగరం, గవర్నరు పేట
బెజవాడ 12-9-47

శతావధాని
(సం.) చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి



అమృత మంత్ర మయం గీతాస్వరూపం. అది అన్ని లోకముల బహుముఖముల గానం చేయబడుతున్నది. వేదగానమునకు గూడ గీతా సారమే మూలము. గీతా ప్రపంచములో భగవద్గీత అదిగీత. అది వాసుదేవ ద్వాదశాక్షరీ విద్యా వివరణ రూపము.

గీత, అష్టాదశాధ్యాయాత్మకం కావటంలో కూడ వైశిష్ట్యం ఉన్నది. వేలువేలు మహామంత్రములు ఆయా అధ్యాయములలో పొందుపరుపబడి వివరముగా వ్యాఖ్యానింపబడి ఉన్నది.

గీతాశాస్త్రం, కృష్ణార్జున సంవాద రూపంగా, అయిదవ వేదంగా గీతమైన మహాభారతంలో కృష్ణద్వైపాయన మునిచే స్వముఖతః గీత మయింది. అంతటితోనే అది అన్ని ఆశ్రమముల వారికి అన్ని తరగతుల వారికి గేయంగా ఉపదేశింపబడింది.

అంతతో తృప్తిపడక శ్రీవ్యాసముని, పామర బాలక వర్గానికికూడా అందుబాటులో ఉండి ఆస్తికత అలవడి, వారలకు అది ఉపాస్యం

కావడానికి తత్ప్రతిభను పద్మపురాణంలో పద్మ మకరందబిందు సందో హంగా ప్రసరింపజేసి ప్రవహింపజేసినాడు. దాని మారు రూపమే ప్రస్తుత గీతాప్రతిభ.

ఈ గీతాప్రతిభ విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రి సరసలేఖిని ద్వారా ప్రతిభావంతమయింది. ఇందు చిన్ని చిన్ని కథలే అయినా ఒకనాడు గీతా మహోపాసనతో ప్రతిభ గడించిన మహనీయుల దివ్య చారిత్రములు కీర్తింపబడి ఉన్నవి వానిలో వారివారి విచిత్ర అనుభవ విశేషములు సవిశేషముగా గీతము లయినవి. అవి ఆస్తికతతో సర్వజన సముపాస్యములు, అనవరత గేయములు.

గీతాపరాయణులై చదువరులు గీతాప్రతిభా సమగ్రపర్యాలోకన గౌరవంతో, గీతానుసంధానం చేసి, ఉపనిషత్ప్రతిపాద్యమయిన శ్రీకృష్ణ బ్రహ్మానంద రసమును ఆస్వాదింతురుగాక.

మన బులుసుశాస్త్రి ఇతోధిక గ్రంథ సంకలనంతో సాధన గ్రంథ మండలీ మండనాయమానముగా ఆంధ్రజన ఆదరణార్హుడు అవుతాడని ఆశీర్వదిస్తున్నాను.

తెనాలి. (సం.) గరిమెళ్ళ కృష్ణమూర్తి M. A. B. L.
సర్వజిత్ భాద్ర. కృ ౫ ప్రిన్సిపాల్ సబ్ జడ్జి



అర్యా!

మీరు పంపిన 'గీతాప్రతిభ' ను చూచితిని. అందు మీరు కూర్చిన కథలలో గీతా మాహాత్మ్యమే గాక బహువిధ ధర్మాధర్మ నిరూప

ణము గూడ కానవచ్చుటచే నేతద్గ్రంథ ప్రాశ స్త్యమినుమడించినది. భాష ధారాళముగను, హృద్యముగను నున్నది.

సంస్కృతకళాశాల (సం) జటావల్లభుల పురుషోత్తము, M A.
కొవ్వూరు 19-9-47 ప్రిన్సిపాల్

---

బ్రహ్మసూత్రములు అష్టాదశ పురాణములు మున్నగు గ్రంథ రాజములను నిర్మించిన శ్రీవ్యాసభగవానునిచే మహాభారత మధ్యమున శ్రీకృష్ణార్జునసంవాదరూపమగు శ్రీమద్భగవద్గీత రచింపబడి ఈప్రపంచ మున సర్వజనాదరణీయమై విరాజిల్లుచున్న సంగతి సర్వ జన విదితమై యున్నది.

ఇట్టి భగవద్గీత యందలి పదునెనిమిది యధ్యాయముల యొక్క మాహాత్మ్యమును, ప్రత్యేకముగా శ్రీపద్మపురాణోత్తర భాగమునమూలకర్త లగు శ్రీ వ్యాసభగవానులే కథారూపమున విశదముగా వర్ణించి యున్నారు. ఆభాగమును ''గీతాప్రతిభ,అను పేరుతో సాధన గ్రంథమండలి తరపున శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి ఆంధ్రీకరించెను.

నేనీ పుస్తకమును మూలమును సమీపమున నుంచుకొని కొన్ని భాగ ములు మాత్రమే చదివియున్నాను. మూలమున నున్న కథా భాగములను చాలా భాగము క్రోడీకరించి చక్కని శైలిలో ఆబాల సాధారణముగ తెలియునటుల వ్రాసి యుండుట మిక్కిలి ముదావహము

సంస్కృతభాషా పరిచయములేని జన సముదాయమునకు మూలముచే గీతామాహాత్మ్యమును గ్రహించుట దుర్ఘటమగుటచే నట్టివారలకుగూడసుబో ధకమగునీగ్రంథము గీతా మాహాత్మ్యమును బోధించి యుత్తేజకము గాగల దనుటయందు సందియ మెంతమాత్రము లేదు.

శ్రీ గీతాకర్తయగు శ్రీ కృష్ణభగవానుడు తనచే నర్జునునకు నుపదేశింప బడిన గీతయొక్క మాహాత్మ్య ప్రతిపాదకమగు నీ "గీతాప్రతిభ" యను పుస్తకమును లోకమున ప్రకాశింప చేయుగాత యని యా భగవానుని ప్రార్థించుచున్నాను.

తర్క-వేదాన్తసార్వభౌమ
(సం.) మండలీక వేంకటశాస్త్రి
సాంగవేద పాఠశాల

గొడుగుపేట, బందరు
30—9—47

---

శ్రీకృష్ణుడు సర్వ వేదార్థసారమైన గీతామృతము భారత భూమిని వర్షించినాడు. వ్యాసమహర్షి దానిని భారత మహాకలశమున సేకరించినాడు. మతాచార్యులందరు దానిని పరమ ప్రమాణముగ గ్రహించి వ్యాఖ్యానించినారు. వైదికధర్మ నిరతులు దానిని పవిత్రతమముగ పూజించుచున్నారు. ప్రపంచమంతయు దానిని అనువదించుకొన్నది.

భారత సంహితయందు భగవద్గీతను సంగ్రహించుటతో వేద వ్యాసుడు తృప్తినొందలేదు. మరల దాని మాహాత్మ్యమును పద్మపురాణమున పదునెనిమిది యధ్యాయములలో కీర్తించినాడు. అందలి విషయమునే ఈ గీతాప్రతిభ రూపమున మా సూర్యప్రకాశ శాస్త్రి తెలుగు దోసిళ్ళకందించినాడు.

ఇందలి, ఒక్కొక్క యధ్యాయము భగవద్గీతలో నొక్కొక్క యధ్యాయమునకుగల మాహాత్మ్యమును మనోహరములగు కథలతో వర్ణించినది. భాషయు శైలియు మనోజ్ఞముగ సులభముగ నలరారుచున్నవి.

చిరంజీవి మా సూర్యప్రకాశశాస్త్రి ధర్మజ్ఞానాభి వృద్ధి సాధకములగు గ్రంథములు యితోధికముగ సంతరింప గలడు. ఇతి శుభాశీః

తె నా లి (సం.) త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి
26-9-47 తెనాలి సంస్కృత కళాశాల పూర్వాధ్యక్షులు,
సాహితీసమితి ఉపాధ్యక్షులు,

---

గీతాప్రతిభ ఉన్నంతలో ఇప్పటికి బాగానే ఉన్నది. సంపూర్ణంగా, ఈ ప్రతిభ ప్రతిభావంతం కావలెనంటే, గీతానుసంధానం సవిమర్శంగా పాఠక లోకానికి అందజేయవలసిన అవసరం ఉన్నదని నా మనవి అప్పుడుకాని గీతోపాసకులు, ఆనందరసోపాసకులు కారు సాధన గ్రంథ మండలి అట్టి సాధనములను త్వరలో సమకూర్చుకొంటుందని ఆశిస్తున్నాను.

తె నా లి (సం.) గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి,
2-10-47 సాహితీ సమితి.

---

# గీతానుసంధానము

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. ౧-౪౪

కులధర్మభ్రష్టులు దీర్ఘకాలము నరకములలో పడియుందురని శాస్త్రములవలన వినికిడి.

నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. ౨-౨౪

ఈ ఆత్మ, నిత్యము, సర్వవ్యాపి, కూటస్థము, అచలము, ఆది తెలియ బడనిది.

కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతు ర్భూర్మా తే సంగోఽ స్త్వకర్మణి. ౨-౪౭

కర్మములను చేయుటయే నీవిధి. కాని, వానిఫలములను పొందుట యందు నీకెట్టి హక్కు లేదు. అంతియుగాక, కర్మ ఫల తృష్ణయు నీకు ఉండకూడదు. అట్లని విహితకర్మములను నీవు విడనాడను కూడదు.

శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 3-35

చక్కగా నిర్వహింపబడిన పరధర్మము కంటె విగుణమైనను స్వధర్మము మేలు. అందువలననే, స్వధర్మమునందు ఉండి మరణము సంభవించినను మేలే. కాని, తనకు విహితము కాని పరధర్మము నాచరింప బూనిన, అది విషమపరిణామమును దెచ్చి పెట్టక మానదు.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. ౪-౮

అసాధువులను శిక్షించి, సాధువులను రక్షించి తద్ద్వారా ధర్మమును లోకములలో నెలకొలుపుటకు నేను ప్రతియొక యుగమున అవతరించు చుందును.

యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతి రేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి౫-౨౪

ఎవడు బహిః ప్రవృత్తిలేక, అంతస్సుఖుడై, అంతరమునందే క్రీడించుచు, అతర్దృష్టి కలిగియుండునో ఆయోగి బ్రహ్మభూతుడై, ఇహ లోకమునందే బ్రహ్మనిర్వాణమును పొందును.

యో మాం పశ్యతి సర్వత్ర, సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి, స చ మే న ప్రణశ్యతి. ౬-౩౦

నన్ను అనగా ఆత్మను సర్వభూతములయందును, సర్వభూతములను ఆత్మయందును, ఎవడు చూచుచుండునో, వానికి నేనెన్నడు దూరము గాను, అతడు నాకు దూరము గాడు.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే

నామాయ త్రిగుణాత్మిక మైనది. అది అలౌకికము. కావున దాని నెవరును దాటలేరు. కాని, సర్వభావేన నన్నాశ్రయించిన వారు మాత్రము నా మాయను దాటగలరు.

అంతకాలే చ మా మేవ స్మరన్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్రసంశయః.

అవసానకాలమున నన్ను స్మరించుచు కళేబరమును విడచినవాడు నా భావమునే తప్పక పొందును.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

నిత్యయుక్తులై ఇతరకామన లేక నన్నే ఆరాధించు వారల యోగ క్షేమమును నెనే వహింతును. ౯-౨౨

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః.

నాయందే మనసు నిలిపి, నాభక్తి చేయుచు, నన్నే యజించుము నన్నే, నమస్కరించుచుండుము. ఇట్లు మత్పరాయణుడవై మెలగుమువో నన్నే పొందుదువు.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే,
ఇతిమత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ౧౦-౮

సమస్తమునకు మూలకారణము నేనే. నావలననే సర్వము ప్రవర్తించు చున్నది. అని యెఱిగి జ్ఞానులు మద్భావసమన్వితులై నన్నే భజించుచుందురు.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః,
నిర్వైరః సర్వభూతేషు యస్సమామేతి పాండవ!

నేనే పరాయణముగా నాబుద్ధితో కర్మల నాచరించుచు నా భక్తి కలిగి సంగ మెడసి, సర్వభూతములయందు వైరభావము సేయని యోగి నన్నే పొందును.

శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్, జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మఫలత్యాగః, త్యాగాచ్ఛాంతి రనంతరమ్

అభ్యాసముకంటె జ్ఞానము, జ్ఞానముకంటె ధ్యానము, ధ్యానము కంటె, కర్మఫలత్యాగము శ్రేష్ఠము. ఇట్టిసర్వోత్కృష్టమైన కర్మఫలత్యాగ మలవడినవాడు పరమశాంతినొందును. ౧౨-౧౨

అనాదిమ త్పరం బ్రహ్మ న సత్తన్నాస దుచ్యతే.

అనాదియైన పరబ్రహ్మను సత్తు అనిగాని, అసత్తు అనిగాని చెప్ప వీలులేదు.

గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే.

దేహ కారణములైన సత్వ రజ స్తమో గుణములను కూడ అతిక్రమించిన దేహి జన్మమృత్యుజరాదుఃఖ నిర్ముక్తుడై, అమృతత్వమును బొందుచున్నాడు.

న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,
య ద్గత్వా న నివర్తన్తే త ద్ధామ పరమం మమ. ౧౫-౬

పరమమైన నాపదమును పొందినవారు తిరిగి సంసారబంధమునకు రారు. ఆ నా పరమపదమును సూర్యుడుగాని, చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపజేయలేరు.

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభః, తస్మా దేతత్త్రయంత్యజేత్.

కామము, క్రోధము, లోభము అను నీ మూడును నరకద్వారములు. ఆత్మనాశనమునకు కారణములు. కావున బుద్ధిమంతుడైనవా డీ త్రికమును తప్పక విడువవలెను. ౧౬-౨౧

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్,
అస ది త్యుచ్యతే పార్థ! న చ త త్ప్రేత్య నో ఇహ.

శ్రద్ధారహితముగ చేయబడు యజ్ఞ దాన తపః కర్మలన్నియు వ్యర్థములు. వానివలన ఇహలోకమునగాని, పరలోకమునగాని ఫలముశూన్యము.

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

సమస్తధర్మములను త్యజించి, సర్వాత్మభావేన నన్నే శరణు పొందుము. నేను సర్వపాపములనుండి నిన్ను విముక్తుని జేయుదును. విచారపడకుము. ౧౮-౬౬

"గీతా గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే"



# శ్రీ కృష్ణశ్శరణాష్టకమ్

## శ్రీ హరియజీ కృతమ్

సర్వసాధన హీనస్య పరాధీనస్య సర్వతః।
పాపపీనస్య దీనస్య శ్రీకృష్ణః శరణం మమ॥
సంసారసుఖ సంప్రాప్తిః సమ్ముఖస్య విశేషతః।
బహిర్ముఖస్య సతతం శ్రీకృష్ణః శరణం మమ॥
సదా విషయ కామస్య దేహారామస్య సర్వథా।
దుష్టస్వభావ వామస్య శ్రీకృష్ణః శరణం మమ॥
సంసారసర్పదష్టస్య ధర్మభ్రష్టస్య దుర్మతేః।
లౌకికప్రాప్తి కష్టస్య శ్రీకృష్ణః శరణం మమ॥
విస్మృత స్వీయధర్మస్య కర్మమోహిత చేతసః।
స్వరూపజ్ఞాన శూన్యస్య శ్రీకృష్ణః శరణం మమ॥
సంసారసింధు మగ్నస్య భగ్నభావస్య దుష్కృతేః।
దుర్భావలగ్న మనసః శ్రీకృష్ణః శరణం మమ॥
వివేకధైర్య భక్త్యాది రహితస్య నిరంతరం।
విరుద్ధ కరణాసక్తేః శ్రీకృష్ణః శరణం మమ॥
విషయాక్రాంత దేహస్య వైముఖ్య హృతసన్మతేః।
ఇంద్రియాశ్వ గృహీతస్య శ్రీకృష్ణః శరణం మమ॥
ఏతదష్టక పాఠేన హ్యేతదుక్తార్థ భావనాత్।
నిజాచార్య పదాంభోజ సేవకో దైన్య మాప్నుయాత్॥

# విషయసూచి


| అ. | | ఫలము | పేజి |
|---|---|---|---|
| ౧. | సుశర్మ | పూర్వజన్మస్మృతి | ౧ |
| ౨. | దేవశర్మ | ఆత్మజ్ఞానము | ౬ |
| ౩. | జడుడు | ప్రేతత్వవిముక్తి | ౧౧ |
| ౪. | భరతుడు | వృక్షములుగూడ తరించుట | ౧౫ |
| ౫. | పింగళుడు | పక్షులుగూడ తరించుట | ౧౯ |
| ౬. | జానశ్రుతిమహారాజు | విష్ణురూపప్రాప్తి | ౨౨ |
| ౭. | శంకుకర్ణుడు | పితృదేవతలు, నీచజన్మలు తరించుట | ౨౬ |
| ౮. | భావశర్మ | బ్రహ్మరాక్షస విముక్తి | ౨౯ |
| ౯. | మాధవుడు | ప్రతిగ్రహణదోష నివారణము | ౩౨ |
| ౧౦. | ధీదబుద్ధి | సర్వాశ్రమ ధర్మఫలము | ౩౬ |
| ౧౧. | సునందుడు | రాక్షసవిముక్తి | ౪౩ |
| ౧౨ | బృహద్రథుడు | మృతసంజీవినీ శక్తి | ౫౩ |
| ౧౩. | హరిదీక్షితుడు | చండాలత్వవిముక్తి | ౫౮ |
| ౧౪. | విక్రమవేతాళుడు | స్త్రీహత్యా జారత్వదోషనివారణ | ౬౨ |
| ౧౫. | కృపాణనరసింహుడు | పశువులుకూడ తరించుట | ౬౬ |
| ౧౬. | ఖడ్గబాహుడు | అమితసాహసము మోక్షము | ౬౯ |
| ౧౭. | దుశ్శాసనుడు | సర్వవ్యాధినివారణము | ౭౨ |
| ౧౮. | ఇంద్రుడు | సర్వయజ్ఞఫలము | ౭౫ |



కల్యాణానాం నిధానం కలిమల
మథనం పావనం పావనానాం
పాథేయం యన్ముముక్షోః సపది
పరపద ప్రాప్తయే ప్రోచ్యమానం.
విశ్రామస్థాన మేకం కవివరవచసాం
జీవనం సజ్జనానాం
బీజం ధర్మద్రుమస్య ప్రభవతు
భవతాం భూతయే కృష్ణ నామ॥

బ్రహ్మాండానాం కోటిసంఖ్యాధికానాం
ఐశ్వర్యం యచ్చేతనా వా తదంశః,
అవిర్భూతం తన్మహః కృష్ణ నామ
తన్మే సాధ్యం సాధనం జీవనం చ॥

10047

ఓమ్

# గీతా ప్రతిభ

## ప్రథమాధ్యాయము

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్;
అద్వైతాఽమృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయనీం
అంబ! త్వా మనుసందధామి భగవద్గీతే ! భవద్వేషిణీమ్.

ఒకనాడు పార్వతి పరమేశ్వరునితో నిట్లనియె. "దేవా! తమయనుగ్రహమున నింతవరకు శ్రీహరిలీలల విను భాగ్య మబ్బినది. మీ ముఖమునుండి భగవద్గీతామాహాత్మ్యమును గూడ వినవలయునని కుతూహల మగుచున్నది సెలవిండు."

అన సంతసించి హరు డిట్లు చెప్పదొడగె— ప్రియే ! శ్రీ మహావిష్ణువును మన మెప్పుడు నుపాసించుచున్నాము. పూర్వ మా హరి శేషశయ్యపై నుండుసమయమున మంగళ దాయిని యగు శ్రీ మహాలక్ష్మి యిట్లు ప్రశ్నించెను. 'నాథా! తాము సమస్త భువనముల కధిపతియై యుండియు నిట్లుదా సీనులై నిద్రాముద్రితులై యుండుటకు హేతువేమి?'

పన్నగశాయి మహాలక్ష్మింజూచి యిట్లనె. "సుముఖి ! నేను నిద్రించుటలేదు. అంతర్దృష్టిచే నామహేశ్వరీ శక్తిని

సాక్షాత్కారము జేసికొనుచుంటిని. దాని దర్శనమునకే గదా యోగులు, మీమాంసకులు మొదలగువారు పాటుబడుచుండిరి. ఆ మాహేశ్వరీ తేజము అజరము, ఆత్మరూపము, రాగ శోక వివర్జితము నై యున్నది. దానిని స్మరించు నన్ను నిద్రించు వానినిగా భావించుచున్నావు.”

“నాథా! మీరు సృష్టిస్థితిలయకర్త లై యుండియు మీకు భిన్నమగు పరతత్వమును ప్రార్థించుటయు మీరా పర తత్వము గలవారగుటయు నాశ్చర్యదాయకముగ నున్నది. కనుక నా పరతత్వమును గురించి తెలిసికొనుట కిచ్ఛగించు చుంటిని ”

“ఆత్మస్వరూపము ద్వైతాద్వైతములకు వేరుగాను, అద్యంతరహితముగాను నుండును. ఇదియే నా స్థిరమగు యథార్థ రూపమై యున్నది. దీనిని గురించి గీతాశాస్త్రమున విపుల ముగా ప్రతిపాదింపబడియున్నది.’

‘ప్రభూ! పరమానందమయ్యును అవాఙ్మానసగోచర మగు నా పరతత్వమును గీతాశాస్త్ర మెట్లు చెప్పగలదు?”

అని యడిగిన లక్ష్మికి శ్రీ హరి యిట్లనియె.

ఋణు సుశ్రోణి వక్ష్యామి గీతాసు స్థితి మాత్మనః ।
వక్త్రాణి పంచ జానీహి పంచాధ్యాయా ననుక్రమాత్ ॥
దశాధ్యాయాన్భుజాం శ్చైక ముదరం ద్వౌ పదాంబుజే।
ఏవ మష్టాదశాధ్యాయీ వాఙ్మయీ మూర్తి రైశ్వరీ॥

పద్మపురాణ-ఉత్తరఖండము (171-27-28)

మొదటి యయిదధ్యాయములు నయిదు ముఖములుగాను, తరువాత పది యధ్యాయములు భుజములుగాను. ఒక యధ్యాయ ముదరముగాను, రెండధ్యాయములు పాదములుగాను మొత్తము పదునెనిమిది యధ్యాయములును వాఙ్మయరూపమగు నీశ్వరీమూర్తియై యున్నది. అష్టాదశాధ్యాయాత్మకమగు గీత జ్ఞానశక్తియను సాధనముచే మహాపాతక నాశనము చేయుచున్నది. ఈ గీతాపారాయణమున పూర్తిగాగాని, ఒక యధ్యాయముగాని, ఒక శ్లోకముగాని, శ్లోకార్థముగాని, పాదముగాని, తుదకు పదముగాని భక్తిపూర్వకముగ నెవడు స్మరించునో వాడు సుశర్మవలె ముక్తికాంతా పరిష్వంగ సుఖము నందు ననుటలో సందియము లేదు. నీ కా చరిత్రము చెప్పెద నాలకింపుము.

పూర్వ ముత్తమబ్రాహ్మణకుటుంబమున సుశర్మయను వాడు కలడు. అతడు వైదికజ్ఞానశూన్యుడై దుర్జన సాంగత్యమున క్రూరు డగుచు జపతపాదుల పరిత్యజించి విషయలోలుడై తిరుగుచుండెను. వ్యవసాయము, ఆకు లమ్ముట ముఖ్యవృత్తులుగా జీవయాత్ర గడుపుచు మాంసాహారి యయ్యెను. ఇట్లు కాలము గడుపుచు నొక నాడామూఢుడు ఋషి వాటికయం దాకులు గోయుచు సర్పదష్టుడై మరణించెను. పాపఫలమగు నరక బాధల ననుభవించి మనుజన్మమున నాత డొక వృషభముగా పుట్టెను. కుంటివాడొకడు దానిని వాహనముగా నమర్చుకొని మిగుల భారమగు పనులు చేయించుచుండ పది సంవత్సరములు గడచెను. ఉన్నత పర్వత ప్రదేశమున నొక నాడు ప్రయాణము చేయుచు నావృషభము భారమును

భరించలేక క్రింద పడి మరణించెను. దైవవశమున కొందఱు సాధువు లామార్గమున నేగుచు నది చూచి జాలి కలిగి దానికి సద్గతులు కల్గుటకై తమ సుకృతములనుండి కొంత కొంత ధారవోసిరి. అపు డా సంఘమున గల యొక వేశ్య "అయ్యో, నే నెట్టి పుణ్యము చేయలేదే! ఏమి ధారవో యుదు?" నని చింతించి "యేమేని చేసితినేనిఅది దీనికి ధారవోయుచుంటి;" నని ధారవోసెను. పిమ్మట యమదూతలు యమునిపాలికి గొంపోవ వృషభమును జూచి యముడు వేశ్య ధారవోసిన పుణ్యముచే నిది విగతకల్మషురాలైన" దనెను. అంతట నది పుణ్యలోక సుఖములం బడసి పూర్వజన్మజ్ఞానము గల యుత్తమ మగు బ్రాహ్మణకులమున జన్మించెను.

పెరిగి పెద్దదై పూర్వజన్మజ్ఞానము కలిగి గ్రిందటి వృషభజన్మలో సుకృతమును ధారవోసిన వేశ్యయింటికి బోయి "తల్లీ నీ సుకృతదానముచే నేను కృతకృత్యుడ నైతిని. నీ విచ్చిన యీ సుకృత మెట్టిది?" యన నామె తన యెదుట బంజరములో నున్న కీరము నిత్యము పలుకు వాక్యములను వినుటచే దన యంతఃకరణము పవిత్రమైన దనియు, నా సుకృతమునే నీకు ధార వోసితిననియు బల్కెను. ఆశ్చర్యముతో వా రుభయులు నా చిలుకను సమీపించి వారి సందేహ కారణమును బ్రశ్నింపగా, పూర్వజన్మస్మృతి గల యాశుక మిట్లు చెప్ప దొడగెను.

"పూర్వజన్మమున విద్వాంసుడనై యహంభావమోహితుడనై రాగద్వేషయుక్తుడనై గురువులను దూషించుచు

దిరుగుచుంటిని. కాలానుసారమున మృత్యుముఖమున బడి నానావిధ నరకయాతనల ననుభవించి సద్గురుదూషణ జేసి యుండుటచే దిరిగి యిట్లు చిలుకనై జన్మించితిని. ఏ పాత్ముడ నౌటచే బాల్యముననే నాజననీ జనకులు కాలధర్మమునొందిరి. కాలము గడచుచుండెను. గ్రీష్మకాలములో నొకప్పుడు దప్పిచే శోషించి యొక తరుమూలమున మూర్ఛావస్థలో బడియుండ దైవవశమున నొక ముని నన్ను గ్రహించి తనయాశ్రమమునకు గొంపోయి యొక పంజరమం దుంచి క్షేమతో నాహార మిచ్చుచుండెను. ఆతడు నిత్యము దన శిష్యులకు శ్రీమద్భగవద్గీతా ప్రథమాధ్యాయము నుపదేశించుచుండ నేనును వినుచు క్రమముగా బఠింప సమర్థురాలనైతిని. దైవవశమున నొక దివసమున నొక చోరుడు యాశ్రమమునకు వచ్చినన్నపహరించి యీమెను విక్రయించెను.'' ఇది నా వృత్తాంతము.

ప్రియే ! లక్ష్మి ! ప్రథమాధ్యాయమును నిత్యము పఠన జేయుటచే బాపములు నశించి చిలుకకు బూర్వజన్మ స్మృతి గలుగుటయు, వినుటచే వేశ్యాంతఃకరణము పరిశుద్ధ మగుటయు, వేశ్య చేసిన పుణ్యప్రదానముచే సుశర్మ పాప విముక్తు డగుటయు సంభవించెను. ఈ విధముగా వారు ముప్వురు నిరంతర గీతాప్రథమాధ్యాయ పారాయణముచే జ్ఞానోదయము కలవారై ముక్తినిబొందిరి. కాగా నిత్యము గీతాప్రథమాధ్యాయ మననమున పూర్వజన్మ స్మృతి తప్పక లభించును.

— ♦ —

# గీతా ప్రతిభ

## ద్వితీయాధ్యాయము

లక్ష్మీ ! ప్రథమాధ్యాయ మహాత్మ్యమును వింటివి. ద్వితీయాధ్యాయ ప్రభావ ముగ్గడించెద. ఏకాగ్రచిత్తవుకమ్ము.

దక్షిణమున పురందరపుర మను పట్టణము గలదు. అందు వేదవేత్తయు, నతిథిపూజారతుడును, ఋషులయెడ ప్రేమకలవాడు, ననేకయజ్ఞములచే దేవతలను దృప్తి పఱచిన దేవశర్మ యను నొక బ్రాహ్మణుడు కలడు. పై విధముగ చేసినవాడయ్యు నాతడు మనస్సునకు తృప్తి లేక పరమ కల్యాణాత్మక మగు తత్వజ్ఞానము తెలియ నుత్సుకత కలవాడై నిత్యము సాధుసేవ చేయుచుండెను. ఈ రీతిగా చాలాకాలము గడచెను. ఒకరోజున నిత్యానందుడు, పరమసాధువు, అనుభవజ్ఞుడు నగు నొకఋషిసేవ లభించ భక్తితో పూజించి నమస్కరించి యాకాంక్షతో దేవశర్మ యిట్లు పలికెను.

"మహాత్మా ! ఆత్మజ్ఞాన మెట్లు కలుగును ? సెల వింము" అన నాయాత్మజ్ఞాని 'వత్సా ! సౌపుర మను గ్రామమున నొక్కెలను కాచు మిత్రవాను డను నొకడు కలడు. నీ వాతని యొద్దకు పొమ్ము. నీ కుపదేశము చేయగలడు' అని చెప్పెను. తోడనే దేవశర్మ సౌపురము చేరి దానికి నుత్తరమున నొక విశాల వనములో నదీతీరమున నొక రాతిమీద కూర్చుని నిశ్చలదృష్టితో చూచుచున్న మిత్రవానుని చూచెను. అచట మృగము లన్నియు మిత్రభావముతో సంచరించు చుండెను, వాయువు మందముగా వీచుచుండెను.

ఆప్రాంత మంతయు శాంతమై మంగళాత్మకముగా నలరారు చుండెను. దేవశర్మ ధ్యాననిష్ఠలో నున్న మిత్రవానుని సమీపించి నమస్కరించి "మహాత్మా! తమవలన నాత్మజ్ఞానమును బడయ గోరి వచ్చితిని. అనుగ్రహించి ధన్యుని జేయ బ్రార్థించుచుంటి" ననెను.

దేవశర్మ వచనముల నాకర్ణించి మిత్రవానుడు క్షణకాలము నిమీలిత నేత్రుడై యిట్లు చెప్పదొడగెను—విద్వాంసుడా! గోదావరీ తీరమున ప్రతిష్ఠానపుర మను పుర మొండు కలదు. అందు దుర్దమన మను వంశమున విక్రముడను బ్రాహ్మణు డొక డుండెను. అతడు తక్కువ కులమందలి కన్య నొకతెను వివాహ మాడి యనేక దుష్కర్మముల నాచరించుచు, నిత్యము నుదర పోషణమునకై యనేక దానములను గ్రహించుచు. జాతివ్యతిరిక్తములైన బనుల నాచరించుచు, జీవితము గడుపు చుండెను. భర్త యొక్క దారిద్ర్యమును, ప్రవర్తనమును జూచి ద్వేషభావముతో నాతని భార్య యన్యుని బతిగా గ్రహించి గ్రామాంతరమునకు వెడలిపోయెను. కొంతకాలమున కామె యొక కన్యక జనించెను. వార్ధక్యమున ననేక బాధల ననుభవించి మృతి బొంది యామె పూర్వకర్మఫలంబుచే ఢాకినియై జన్మించెను. దుర్మార్గురాలై నరమాంసమును భక్షించుచు దిరుగుచుండ నొకనాడు మనుజులచే బలవంతముగ జంపబడి యామె నరక యాతనలు ననుభవించి మఱల బెద్దపులియై జన్మించెను. ఆ జన్మయం దనేక ప్రాణులను హింసించి మృతి బొంది యామె తిరిగి నా గృహమందు మేకయై పుట్టెను.

వి[క్రముడును వార్ధక్యమం దనేక కష్టముల ననుభవించి తుదకు గాలధర్మము నంది యమయాతనల ననుభవించిన పిమ్మట పెద్దపులినై జన్మించెను.

ఒక సమయమున వనమందు నేను గొఱ్ఱెలను గాచుకొనుచుండ నొక పెద్దపులి (వి[క్రముడు) యటకు వచ్చెను. దానిం జూచి గొఱ్ఱె లన్నియు జిందర వందర యగుటచే నేనును [ప్రాణములను గాపాడుకొన [ప్రయత్నించు చుంటిని. ఇంతలో నా మందయందలి మేక భయము వీడి వ్యాఘ్రమును సమీపించి గంభీరముగా దయతోడ నిట్లు పలికెను. "ఓ వ్యాఘ్రమా ! ఏ మాలోచించు చుంటివి ? నీ కిష్ట మగు నాహారము లభించినపు డెందుల కూరకుంటివి? ఆకలి యగుట లేదా ? నేను నీకు రుచ్యమగు భోజ్యమును గానా ?" యని [ప్రశ్నింప, పెద్దపులి యిట్లు చెప్పెను. "ఓ ఛాగమా ! నీ విచటకు వచ్చువఱకు నేను ద్వేషభావము కలిగియుంటిని. కాని నీవు సమీపించినతోడనే యా ద్వేషభావము నశించిపోయినది. ఆకల దప్పికలు దూరమైనవి. నే నిక నిన్ను భుజింప" ననగా "నీకు ద్వేషము, ఆకలిదప్పిక లెట్లు పోయినవో ? నీ వెఱిగి యున్న నాకు దెలియ జెప్పు" మని యజము [ప్రశ్నించెను. పులియు నాకును దెలియ దనెను. అపు డామేకయు, వ్యాఘ్రమును గలసి నా యొద్దకు వచ్చి నన్ను దమ సందేహకారణమును జెప్పుమని కోఱ నే నాశ్చర్యచకితుడనై నాకును దెలియ దని పలికి వారిని వెంట బెట్టుకొని యెదుట వృక్షమందున్న వానరరాజము కడకు బోయి యిట్లు [ప్రశ్నించితిని— "ఓ వానరరాజమా ! మా ముఫ్వురకు గల సందేహకారణ

మును విశదీకరింపుము.” అనుటయు నవ్వానరరాజు సాదర పూర్వకముగ నిట్లు చెప్పదొడిగెను—

విప్రవరా ! ఇవ్విషయమున ప్రాచీనేతిహాస మొండు కలదు. ఈ సమీపమందు మీా కెదురుగనే దేవాలయ మొకటి యున్నది. అందు బ్రహ్మచే స్థాపింపబడిన శివలింగ మొకటి కలదు. పూర్వము సుశర్మ యను నాతడీ మందిర మున దపము జేసికొనుచుండెను. ఈ వనమందలి పుష్పముల తోడను, జలముతోడను న ప్పరమేశ్వరు నారాధించుచు, నాతడీ మందిరమున జాలకాలము వసియించెను. ఇటులుండ నొకనా డాతని యాశ్రమమునకు కొక యతిథి యరుదెంచెను. అపుడు సుకర్మ యర్ఘ్యపాద్యాదికములతో నాతని నాదరించి యిట్లు పలికెను—“మహాత్మా! ఇచట నేను చాలకాలము నుండి తత్వజ్ఞానము నెఱుంగ గోటి యీశ్వరోపాసనము జేయు చుంటిని. నేడు తమరాకచే నా యీశ్వరారాధనము సఫల మైనది. మీా యనుగ్రహము కూడ నాకు లభించిన నేను మిక్కిలి ధన్యుడ నగుదును.”

అనుటయు నా యతిథి కడు సంతసించి యొక శాతి ఫలకముమీాద గీతా ద్వితీయాధ్యాయమును వ్రాసి యిట్లు పలికెను.—“సుకర్మా ! నిత్యము నీ వీ యధ్యాయమును పారాయణము చేయుము దీనిని బఠించుటచే దప్పక నీ మనోరథ మీాడేరును.” అని పలికి యా యతిథి యచటనే యంతర్ధాన మొందెను. సుకర్మయు విస్మితుడై యతని యాజ్ఞానుసారముగా నిత్యము గీతా ద్వితీయాధ్యాయమును

బారాయణ జేయమొదలిడెను. ఇట్లు పారాయణ చేయు చుండ కొంత కాలమున కాతని కంతఃకరణము పరిశుద్ధమై యాత్మజ్ఞానము లభించెను. క్రమముగా సుకర్మ యడు గిడిన ప్రదేశము లన్నియు బ్రశాంతములు కా జొచ్చెను. ఆ ప్రదేశ ములందు సుఖదుఃఖములు, శీతోష్ణములు, రాగద్వేషములు మున్నగు ద్వంద్వభావము దూరము కాసాగెను. ఆప్రదేశము ఉందలి జీవుల కాకలి దప్పిక అంతరించి భయము పటాపంచ లమయ్యె నని వానరరాజు పల్కిన వచనంబులనాలకించి నేను మేకను వ్యాఘ్రమును వెంటబెట్టుకొని యీ శిలాఫలకము వద్దకు బోయి యందలి గీతాద్వితీయాధ్యాయమును జదివి వారికి వినిపించితిని. అట్లు కొంత కాల మా యధ్యాయ మును బారాయణ చేయగా నాతపము ఫలించినది. కావున నీవును అట్లె యీయధ్యాయమును బారాయణ చేయుము. నీకు ముక్తి తప్పక కరతలామలకము కాగలదు.

లక్ష్మీ! యిట్లు మిత్రవానుని యుపదేశమును గ్రహించి దేవశర్మ తన పురందరపురంబునకు బోయి తొలుత దానాశ్ర యించిన మహాత్ము డాలయమం దుండగా నాతనితోడ జరి గిన వృత్తాంత మంతయు జెప్పి నిత్యము తాను గీతాద్వితీయా ధ్యాయమును బారాయణ చేయుచు నాత్మజ్ఞానమును సంపా దించుకొని తుదకు బరమపదము నొందెను.

కావున నెవ్వ రీ ద్వితీయాధ్యాయమును భక్తితో బారా యణము సేయుదురో, వా రవశ్యముగ నాత్మజ్ఞానమును బడసి యుత్తమ గతులను బొందుదురు.

— ♦ —

# గీతాప్రతిభ

## తృతీయాధ్యాయము

శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవికి జెప్పినటుల బరమేశ్వరుం డీ మాహాత్మ్యమును బార్వతికి జెప్పుచున్నాడు. ప్రియే ! జన స్థానమందు జడు డను బ్రాహ్మణు డొకడు కలడు. అతడు దురాచారపరుడై జాతిధర్మముల విడనాడి పరస్త్రీలోలుడై తిరుగుచు, సురాపానము సేయుచు, బరులను హింసింపుచు గాలము గడపుచుండెను. దుర్వ్యసనముల మూలమున నాతని ధనమంతయు నశించిపోవుటచే నాతం డుత్తరదిశయందు వ్యాపారము జేయ జాలదూరము పోయెను. ఇట్లు పోయి పోయి ధనము నార్జించుకొని తిరిగి తన జన్మస్థానమునకు వచ్చుచుండ మార్గమధ్యమున సూర్యాస్త మయ మగుటచే నాటి రాత్రి యతం డొక వృక్షమూలమున నిదురించెను. అయ్యర్ధ రాత్రమున నతం డేలకో దైవవశమున నచట నే మృతి బొంది పాపాత్ముడై యుండుటచే బ్రేతరూపు డయ్యెను.

ఆ జడునకు ధర్మపరుడు, గడు యోగ్యుడు, నిత్యము గీతాతృతీయాధ్యాయము పారాయణము జేయువాడు నగు కొమరు డొక డుండెను. అతం డొకనాడు తన తండ్రి రాకకై విచారించుచుండ తండ్రియొక్క మిత్రులు కొందఱు వచ్చి "నీతండ్రి మృతి బొందె" నని జెప్పిరి. అది విని యాతడు తన తండ్రికి బారలౌకికక్రియలు చేయ బూని తగుసామగ్రి నంతను సమకూర్చుకొని కాశికి బయనమయ్యెను. అట్లు పయనమై పోయి యాతడు తొమ్మిదవ నాటి సాయంసమయమునకు

వనతండ్రి మృతి బొందిన వృక్షమూలమును జేఱెను. అచట
దన కాలకృత్యంబుల నన్నిటిని నిర్వర్తించుకొని యా వృక్ష
మూలమున గూర్చొని యతడు భక్తితో గీతా తృతీయాధ్యా
యమును బారాయణ జేసెను. అంతలో నంతరిక్షమున నొక
భయంకరశబ్దము వినవచ్చుటచే నతడు తల నెత్తి పైకి
చూచెను. అప్పు డతడు తనతండ్రి ప్రేతదేహమును విడచి
దివ్యవస్త్రాద్యలంకారభూషితుండై దేవత లందఱిచే సేవింప
బడుచు నొక దివ్యవిమానమునందు గూర్చుండుటను గను
గొని వెంటనే యటకుబోయి తండ్రికి నమస్కరింప దండ్రియు
నతని నాశీర్వదించెను. అపుడు కుమారుడు తండ్రితో,
దండ్రీ! "నీకీ ప్రేతదేహము పోయి దేవత్వము లభించుటకు
గల కారణమేమి?" యని యడుగ దండ్రి యిట్లు ప్రత్యు
త్తర మిచ్చెను.

కుమారా! దైవయోగమున నీచే బఠింపబడిన గీతా
తృతీయాధ్యాయమును శ్రవణము జేయుటచే నాకీ దివ్య
దేహము సంప్రాప్తమైనది. నీ విక గాశికి బోవ నక్కఱలేదు.
ఈ తృతీయాధ్యాయ పారాయణము చేతనే స్వర్గము సులభ
సాధ్యమగును. కావున నీ విక గృహమునకు వెడలి పొమ్మని
అనుటయు గుమారుడు మఱల "దండ్రీ! నీవు నా కుపదేశింప
దగు విషయములను వెంటనే యుపదేశింపుము" అని
యడిగెను.

కుమారా! నేను పాపత్ముడనై పుణ్యాత్ములగు నా
వంశజులు నందఱును నరకముల పాలు జేసితిని. నీ యనుగ్ర
హము వలన నరకయాతనల ననుభవించకుండగనే నాకు

శీఘ్రముగా విష్ణులోకప్రాప్తి కలిగినది. కనుక నీవు తృతీయాధ్యాయ పారాయణముచే నరకపతితులై యున్న మన వంశజుల నందఱ నుద్ధరించి వారికి నుత్తమగతులు గలుగ జేయుము. అని తండ్రి యాజ్ఞ యిచ్చెను.

కుమారుడు "తండ్రీ నీవు చెప్పినరీతిగా మనవంశజుల నే కాక నరకమందు బడియున్న జీవులనన్నిటిని గూడ నీ తృతీయాధ్యాయ పారాయణముచే దరింప జేయును. ఇదియే నాకోరిక" యని పలికెను. అదివిని తండ్రి "అట్లే యగుగాక! నీకును గల్యాణము కాగలదు పొమ్ము" అని పలికి వైకుంఠము నకు బోయెను.

పిమ్మట నాతని పుత్రుడు తిరిగి జనస్థానమునకు వచ్చి మిక్కిలి నిష్టతో విష్ణుమూర్తి యాలయమున తృతీయాధ్యాయమును బారాయణము సేయుచు నా ఫలమును నరకమందలి జీవుల విముక్తికై ధారవోయుచుండెను.

ఇటులుండ విష్ణులోకమున శ్రీహరి తన దూతలను బిలచి "మీరు వెంటనే యమలోకమునకు బోయి నరక మందలి జీవులను, యమధర్మరాజును వెంటబెట్టుకొని తీసు కొనిరండు" అని యాజ్ఞాపించెను. అది విని విష్ణుదూతలు యమలోకమునకు బోయి సాదరముగ దమ ప్రభువుయొక్క యాదేశమును యమునకు నివేదింప యముడును వారిని దగు రీతిని గౌరవించి సుఖాసీనులగావించి యిట్లు పలికెను—

మహాత్ములారా ! నా యీలోక మందలి జీవులను, నన్నును మీ ప్రభు వేల దీసుకొని రమ్మనెను ?

అప్పుడు విష్ణుదూత లిట్లు పలికిరి—యమధర్మరాజా ! వైకుంఠమునగల మా ప్రభువగు విష్ణుమూర్తి నిన్నును, నరక మందలి జీవులను వెంటబెట్టుకొని రమ్మని మాకాజ్ఞాపించెను. కావున నచటకు గొనిపోవుటయే మాకు బరమధర్మము. ఇంతకన్న మే మేమియు నెఱుంగము. అనవుడు యముడు వారి యాజ్ఞను శిరసావహించి నరకజీవులనందఱను వెంటనిడు కొని విష్ణుదూతలతో గూడ వైకుంఠమున కేగి లక్ష్మీనాథుని సందర్శించి నిటలతటఘటితాంజలియై యిట్లు స్తుతించెను.

పరమేశ్వరా ! నీయంతఃకరణము మిక్కిలి బవిత్రమై నది. తొల్లి నీముఖమునుండియే వేదము లుద్భవించినవి. జనార్దనా ! నీవు సర్వవ్యాపివి. జగత్పరిపాలకుడవు. నీకు నమస్కారము. ప్రభూ ! నీయాజ్ఞానుసారముగ నేను నరక మందలి జీవుల నందఱను దీసుకొని వచ్చితిని. ఇక నేను చేయ దగు గార్యమేదో సెలవిమ్ము.

ధర్మరాజా ! తిరిగి నేనాజ్ఞ యిచ్చువరకు నీవు నరక మందలి జీవుల నందఱను నిటకు బంపివేయుచుండుము. ప్రతి మనుజుని పాపభారమును నేను స్వయముగా భరించెదను" అనిపలికి శ్రీహరి యంతర్ధాన మొందెను.

ధర్మరాజును తా నొక్కడు తన పురమునకు వెడలి పోయెను. అటులా బ్రాహ్మణుడు సమస్తజీవుల పాపము లను బోగొట్టుచు నంతమునకు వైకుంఠమును బొందెను.

కావున నీతృతీయాధ్యాయ పారాయణము వలన నెట్టి మహాపాతకుడైనను ముక్తిబొందును. మఱియు ముఖ్యముగ ప్రేతత్వము గూడ పరిహారమగును.

— ० —

# గీతా ప్రతిభ

## చతుర్థాధ్యాయము

పార్వతీ! లక్ష్మికి నారాయణుడు చెప్పిన చతుర్థాధ్యాయ మాహాత్మ్యమును జెప్పెదను. సావధానురాలవై వినుము.

ఏ యధ్యాయ మాహాత్మ్యముచే రేగుచెట్లరూపమున నున్న కన్యకలు శాపవిముక్తలై స్వర్గమును బొందినారో, లక్ష్మి నారాయణునిచే జెప్పబడిన యీ చతుర్థాధ్యాయ మాహాత్మ్యమును జెప్పుచుంటిని, సావధానురాలవై వినుము.

నాథా ! ఆ కన్య లెవ్వరు? ఎందువలన బదరీ వృక్షములై జన్మించిరి ? ఆ విచిత్రగాథ యంతయు సవిస్తరముగ విశదీకరింపుడు అన, శివు డిట్లు జెప్పదొడగెను.

గంగాతటమున వారణాసి యను పురమొండు గలదు. అచట విశ్వనాథుని యాలయమున భరతు డను మహాత్ముడు యోగనిష్ట గలవాడై యాత్మచింత నయందుదత్పరుడై నిత్యము శ్రీమద్భగవద్గీతా చతుర్థాధ్యాయమును బారాయణ జేయుచుండెను. కొంతకాలమున కాతడు శీతోష్ణములందును, సుఖదుఃఖములందును సమభావము గలవాడై మహాత్ముల సందర్శించు గోరికతో బ్రపంచమునబర్యటనము జేయమొదలిడెను. ఒకరోజున యరణ్యమందు బ్రయాణము జేయుచుండ సాయం సంధ్యాసమయ మగుటచే గాలకృత్యంబుల దీర్చుకొని గీతా చతుర్థాధ్యాయమును బారాయణజేసి యొక రేగుచెట్టు మూల

మున శిరమునుంచి మఱియొక రేగుచెట్టు నైపునను బాదము లను జాచి నిదురించెను. ప్రాతఃకాలమున నటనుండి లేచి మఱియొక చోటునకు బోయెను.

నాటి కైదవదివసమున నా వృక్షములు రెండును క్రమముగా గృశించి కాలధర్మమునొంది మఱల నుత్తమ బ్రాహ్మణ కులమున పూర్వజన్మ స్మృతి గల బాలికలై జన్మించిరి. ఏడు సంవత్సరముల వయస్సు గలవారైన తఱి దైవవశమున నా భరతమునీంద్రుడు పర్యటన జేయుచు నొక దినమున వారి గృహంబున కరిగెను. అప్పుడా కన్య లాతని దూరమునుండియే కనుగొని సమీపించి సాష్టాంగప్రణామం బాచరించి 'మహాత్మా! మీ దయవలన మే ముభయులము దరించితిమి. మే మరణ్యమున రేగుచెట్ల రూపమం దున్నపుడు మీ శరీర స్పర్శవలన దరించి మానవ జన్మ నొందితిము' అని పలికిరి. ఆ పలుకులు విని యా ముని యాశ్చర్యము నొంది 'కన్యకలారా! మీచరిత్ర మంతయు గడు విచిత్రముగా నున్నది. సాంతముగా నాకు మీ పూర్వజన్మ వృత్తాంతము దెలియజేయుడు' అని పలికెను. అప్పుడా కన్యక లిట్లు చెప్పదొడంగిరి.

మునివర్యా! గోదావరీతీరమున ఛిన్నపాప మను నొక పుణ్యక్షేత్ర మున్నది. అది మనుజుల కత్యంత పుణ్యప్రదంబును గడుంగడు నుత్తమము నై యుండెను. అందు సత్యతపుం డను నాతడు గ్రీష్మఋతువునందు పంచాగ్నిమధ్యమునను, వర్షాకాలమందనవరత ముసల వర్ష ధారలయందును, శీతాకాలమునందు కంఠము లోతుగల జలమందునను నిలచి ఘోరతప మాచరించుచుం

సెను. తపముచే గృశించి యాతని దేహ మంతయు ముడతలు పడియుండెను. ఆతని దేహమునకు బైభాగమునను, నంత ర్భాగమునను కూడ నిష్కల్మషభావము తేజరిల్లు చుండెను. అతడు నిత్యము నాత్మధ్యాన నిమగ్నుడగుచుండెను. నిత్యము బ్రహ్మ స్వయముగా నచటకు వచ్చి వాని యుపదేశములను వినిపోవుచుండును. ఒక్కొక్క సమయమున జతురాననుడు వచ్చినను సత్యతపుడు తపస్సమాధి నుండి లేచువాడుకాడు. అతనిని బ్రహ్మయంతవాడు గూడ బరమ మిత్రభావముతోడ గౌరవించుచుండెను. పరమాత్మను దృఢభావముతోడ ధ్యానము జేయుచుండుటచే నాతనితపము చరమకోటి నధిష్ఠింప జొచ్చెను. ఈ సత్యతపుని తపమువలన దనపదమున కేమి భంగము వాటి ల్లునో యని భయము జెంది యింద్రుం డాక్షణముననే యప్సరో గణంబులను రావించి యందు మమ్మిద్దఱ నిటు లాజ్ఞాపించెను-అప్సరసలారా! 'మీ రిద్దఱును బోయి స్వర్గ రాజ్యమును గోరి తపము జేయుచున్న యా సత్యతపుని తపంబునకు విఘ్నం బొనర్పుడు.'

అనుటయు మే ముభయుల మాతని యాజ్ఞానుసార ముగా సత్యతపుడు తపమాచరించుచున్న ప్రదేశమున కరిగి యచట మధురముగా గానము జేయ నారంభించితిమి ముఱియు నృత్యము సేయుచు నాతని సమీపించి యింకను ననేక విఘ్న కార్యంబులను జేయబూనితిమి. అంత నమ్మునీంద్రుడు క్రోధా రుణిత లోచనుడై చేత జలమును గ్రహించి 'మీరుభయులును గంగాతీరమ్మున రేగుచెట్లై జన్మింతురుగాక!' యని మమ్ములను శపించెను. వెంటనే మేము నమ్రభావముతోడ 'స్వామీ! మేము

పరాధీనజీవితము కలవారము. కావున దాము మమ్ము దయజూచి మన్నింపుడు' అని ప్రార్థింపగా, నాతడు 'భరతముని మీా సన్నిధికి వచ్చువరకు మీాకీ శాపముండును. అనంతరమున మీారు శాపవిముక్తిబొంది పూర్వజన్మస్మృతి కలవారై మానవలోకమున జన్మించి క్రమముగా మీా పూర్వస్థానంబును బొందగలరు' అని యాదేశించెను.

ఓ మునిపుంగవా! నాటినుండియు రేగువృక్షముల రూపముదున్న మా సన్నిధికి వచ్చి తాము గీతా చతుర్థాధ్యాయమును బఠించుటచే మాకా తరురూపము పోయి మానవత్వము సంప్రాప్తమైనది. ఇక మీాదట మేము గీతా చతుర్థాధ్యాయమును బారాయణ జేయుచు మిక్కిలి భయంకరంబగునీసంసార సాగరమును దరించి ముక్తిని బొందెదమని చెప్పిరి.

కావున నీనాలుగవ యధ్యాయమును బారాయణ జేయుటచే వృక్షములుగూడ నవశ్యము దరింప గలవు.

— ◆ —

# గీతాప్రతిభ

## పంచమాధ్యాయము

దేవీ ! అందఱిచే నాదరింపబడు బంచమాధ్యాయ మహాత్మ్యమును సంక్షేపముగ జెప్పుచుంటిని. సావధానచిత్తవై యాకర్ణింపుము.

మద్రదేశమున బురుకుత్సమను బట్టణ మొండుండెను. అందు బింగళుడను బ్రాహ్మణు డొకడుండెను. అతడు వేదాధ్యయనము జేయు నుత్తమ బ్రాహ్మణకులమున జన్మించియు, దన కులవిహితములగు వేదశాస్త్రములను విడచి దుష్టసాంగత్యము జేయుచు, సంగీతమును నాట్యమును, అభ్యసించి ప్రసిద్ధుడై యొక రాజస్థానమున బ్రవేశించి కాలము గడపుచుండెను. అతం డట నొక స్త్రీని ప్రేమించి యీ ప్రపంచమం దామెకంటె నధికమగున దెద్దియును లేదని తలంచి యెల్లవేళల నామె ననుసరించి తిరుగుచుండెను. అతడు రహస్యముగా రాజుతోడ నితరుల యందు లేనిపోని నేరముల నారోపించి చెప్పుచుండెను.

పింగళునకు దక్కువ కులమందు జన్మించిన యరుణయను భార్య యుండెను. కాలవశమున నామెయు నొకని బ్రేమించి కాలము గడపుచుండెను. తన నడతకు భర్త యభ్యంతరము గలుగజేయునను దలంపుతో నొక దినమున నర్ధరాత్రమం దాతని శిరము పగులగొట్టి యా కళేబరమును భూమియందు బాతిపెట్టెను. అట్లు మృతి బొందిన పింగళుడు దీర్ఘ

కాలము యమయాతనల ననుభవించి తిరిగి యరణ్య మందొక గ్రద్దయై జన్మించెను. అరుణయు గాల వశమున భగంధర రోగముచే బీడితురాలై మృతిబొంది నరకయాతనల ననుభవించి గ్రద్ద నివసించు యరణ్యమందే యాడ చిలుకయై జన్మించెను. ఒకదినమున నాహారార్థమై తిరుగుచుండ బూర్వజన్మ వైరముచే గ్రద్దయు, చిలుకయు బరస్పరము పోరాడుచు దైవ వశమున జలముచే నిండిన ఒక ఋషీశ్వరుని పుఱ్ఱెయందు బడి మృతిబొందినవి. యమదూతలు వారినిద్దఱను యముని కడకు గొంపోవ వారిని గుఱించి యముడిట్లు పలికెను—దూతలారా! వీరిద్దఱును మృత్యుసమయమున నమ్మునిపుఱ్ఱెయందు బడి మృతి నొందుటచే సర్వపాపములు నశించి పరమపవిత్రులైరి. కావున వారికి యిష్టలోకములను బ్రసాదించితిని. అనుటయు వారిద్దఱును విస్మితులై ధర్మరాజునకు నమస్కరించి "మహాత్మా! పూర్వజన్మమున మేమనేక పాపకృత్యముల నాచరించితిమి. ఎట్టి పుణ్యమును జేసి యెఱుగము. అట్టితఱి మాకిట్టిసుకృత మెట్లు లభించినది? వినగోరుచుంటి" మని పలికిరి.

ఓ పుణ్యదంపతులారా! గంగాతీరమున నుత్తమ జ్ఞానియు, నేకాంతసేవియు, మమతారహితుఁడు, శాంతిశీలుఁడు, విరక్తుఁడు, ద్వేషరహితుఁడు, నగు వటుఁడను మహాత్ముఁడొకఁడు కలఁడు. అతఁడు నిత్యము నియమముతో గీతాపంచమాధ్యాయమును బారాయణ జేయుచుండెను. గీతాపంచమాధ్యాయ శ్రవణమాత్రమున మహాపాపి కూడ బునీతుండగును. అట్టి పుణ్యప్రభావము చేతనే వటుఁడు బ్రహ్మజ్ఞానమును బొంది

దేహమును విడచెను. గీతాపంచమాధ్యాయ పారాయణమున నాతని దేహము పరమపవిత్రమయ్యెను. అట్టివాని కపాలమందు బడి మీరిద్దఱును ప్రాణములను విడచియుంటిరి. అందుచే మీరును బునీతులైతిరి. కావున మీకిష్టలోకములను బ్రసాదించుచుంటిని. అట్లు ధర్మరాజానుమతిని బడసి వారిద్దఱును బుష్పక విమానారూఢులై వైకుంఠమున కేగిరి.

కావున గ్రూరకర్మల నాచరించి పక్షులై జన్మించియు, నేకారణము చేతనైన గీతాపంచమాధ్యాయ సంబంధము కలిగినచో దప్పక జన్మరాహిత్యంబగు వైకుంఠ ప్రాప్తి కలుగును.

— ◆ —

# గీతా ప్రతిభ

## షష్ఠాధ్యాయము

సుముఖీ ! ఆఱవ యధ్యాయ మాహాత్మ్యమును జెప్పు చుంటిని. ఇది విన్నంతమాత్రముననే ముక్తి కరతలామలకం బగును. సందియము లేదు.

గోదావరీతీరమున బ్రతిష్ఠాన పురమను నొక విశాల నగరముండెను. అచట నేను (ఈశ్వరుడు) పిప్పలేశ్వరు డను పేరుతో నివసించు చుంటిని. ఆ పట్టణవాసుల నందఱను జానశ్రుతి యను మహారాజు సాదరముగ బరిపాలించు చుండెను. ఆతడు నిత్యము యజ్ఞములు సేయుచు, నపరిమిత దానములు సేయుచుండెను. ఆ యజ్ఞకుండమందలి ధూమము స్వర్గమందు గల కల్పవృక్షపర్యంతము వ్యాపించగా గల్ప వృక్షము కూడ శిగ్గుజెందెనో యన నా ధూమముచేత నల్లబడి పోయెను. ఆ యజ్ఞమందలి హవిర్భాగంబులను భుజించుటకై దేవతలందఱును వచ్చి యా పట్టణముననే నిత్యము వసించు చుండిరి. ఆ రాజు విడచు దానోదకము, ప్రతాప మను దేజము, యజ్ఞకుండమందలి ధూమము నీమూడును, గలసి మేఘముగా నేర్పడి సకాలమున వర్షించుచుండును. అతని రాజ్యమున యీతి బాధలు లేక నీతినియమములు కలిగి ప్రజలు వర్తించుచుందురు. ఆ రాజు చేయు దానధర్మములకు సంతసించి వరము లిచ్చుటకై దేవతలు హంస రూపమును ధరించి యొక్కొకతఱి యంత రిక్షమందు సంచరించు చుందురు. అందు భద్రాశ్వము లను

రెండు హంసలు వేగముగా ముందు నడచుచుండ మిగిలిన హంసలన్నియు వాటితో నిట్లనినవి— ఓయి భద్రాశ్వా! ఈ మార్గము కడు దుస్తరమైనది. జాగరూకతతోడ బోవలయును. కనుపించుటలేదా ? జానశ్రుతి మహారాజు తేజము తీవ్రముగ గనుపించు చున్నది. అది మనలను దహింప వచ్చును. ఈ వాక్యములు విని భద్రాశ్వములు నవ్వి పరిహాసముగా నిట్లు పలికెను. 'బ్రహ్మవేది యగు రైక్వ మహాముని సంభాషణమును జానశ్రుతి మహారాజు తన మేడయం దుండి విని వెంటనే క్రిందకు వచ్చి మంత్రిని బిలచి యిట్లు పలికెను—

ఓ మంత్రీ! నీవును రథసారథియగు మహుడును గలసి పోయి రైక్వ మహామునిని వెదకి ఆతని నిచటకు దీసుకొని రావలయును.' అనుటయు వారు రాజాజ్ఞానుసారముగా నా రైక్వ మహామునిని వెదకుటకై ప్రథమమున విశ్వేశ్వరుని వాసస్థాన మగు వారణాసియు, లోకోద్ధరణార్థము శ్రీ హరి వసించు గయయు మఱి యితర పుణ్యక్షేత్రములందును వెదకుచు ముదారికి వాసస్థానమగు మధురాపురము జేరిరి.

ఆ మధుర యందు గల శ్రీహరిని సర్వకాలములందు దేవతలు, మానవులును బూజించుచుందురు. ఆ పురము సర్వ విధముల వర్ణనాతీతమై యుండెను. ఆ పురమం దంతటను వెదకి సర్వసద్గుణ శోభితమగు జగన్నాథ నివాసంబైన జగన్నాథము జేరిరి. అటనుండి వారు దానికి వాయవ్యభాగమున

గల కాశ్మీరము జేరిరి. ఆ పురము శ్రీ పరమేశ్వరుని నవ్వువలె తెల్లనై యొప్పు అనేక ప్రాసాదములతో నొప్పుచుండెను. అందు వేదవేదాంగ వేత్తలగు బ్రాహ్మణులు వసించుచుండుటచే మూగవారు సైతము వాక్చాతుర్యము కలవారగుచుండిరి. అందు జరుగు యజ్ఞముల ధూమము ఆకాశమందు వ్యాపించ నంతరిక్షము కాల మేఘమువలె దేజరిల్లుచుండెను. మాణిక్యేశ్వరుడను పేరు గల పరమేశ్వరుడా పురవాసులందఱకు సుఖము గలుగ జేయుచుండెను. సమస్త శత్రువులను జయించి దిగ్విజయము బొంది మాణిక్యేశ్వరు నర్చించుటచే మాణిక్యేశ్వర మహారాజను బేరుపొందిన మహారాజు పురమును బాలించుచుండెను.

ఆ యాలయ ద్వారమున నొక శకటమందొక ముని కూర్చొనియుండ జూచి మంత్రియు, సారథియు, నాతనిని సమీపించి ప్రణమిల్లి స్వామీ! సర్వత్ర సమభావముగల మీరల చట నిట్లుండుటకు గారణమేమియో తెలుసుకొన గోరుచుంటిమని యడిగిరి.

పూర్ణానందుండగు నా రౌక్ష్యుడు వారి వాక్యము లాలించి క్షణకాలము నిమీలితనేత్రుడై యిట్లు పలికెను— ఓయీ ! నేను పూర్ణకాముడను. కావున నెవ్వరైన నా మనస్సు నెఱింగియే నాకు సేవ జేయవలయును. అది విని వారిద్దఱు ముని యభిప్రాయమును దెలిసికొని వెంటనే రాజు వద్దకు బోయి జరిగిన యుదంతమంతయు దెలియజేసిరి. వెంటనే యా రాజు రౌక్ష్యుని సందర్శించి సేవింపవలయు నను

దలంపుతో నొక వేయి గోవులను, మంచి వస్త్రములను, ముత్యాలహారములను గానుకగా దీసికొని రైక్వుని సన్నిధికి బోయి యా వస్తుజాతమునంతను నాతని యెదుట నుంచి సాష్టాంగప్రణామంబు జేసెను.

అంత మునియు భక్తితో గోపము కలవాడై 'ఓ మూర్ఖా! నా విషయమును నీ వెఱుంగవా ? నీ వస్తుజాతము నంతను దిరిగి నీవు గొని పొమ్ము. నా కేమియు నక్కఱ లేదు.' యని పలుకగా నారాజు వెఱగంది 'మహానుభావా ! తమ కిట్టి ప్రతిభ యెట్లు కలిగినదో తెలిసికొన గోరుచుంటిని. సెలవిండు' అనియడగెను. అది విని 'నేను నిత్యము గీతయందలి యాఱవ యధ్యాయమును పారాయణము జేయుచుంటిని. అందుచే నాకు దేహముకూడ భారమగుచున్నది.' అని రైక్వుడు పలుకగా నాటినుండియు రాజుకూడ భక్తిగలిగి రైక్వునితో నీ యాఱవ యధ్యాయమును పారాయణము జేసెను, అందుచే నారాజున కత్యల్పకాలముననే మోక్షము లభించెను. రైక్వుడు కూడ నా మాణిక్యేశ్వరుని యెదుటయాఱవ యధ్యాయమును పారాయణ జేయుచు దుదకు వైకుంఠమును బొందెను. వరములీయ వచ్చిన దేవతలుకూడ దమతమ స్థానముల కరిగిరి.

కావున నీ యాఱవ యధ్యాయము నెవ్వడు నిశ్చల భక్తితో నిత్యము బఠించునో యాతడు సర్వదానముల వలన గలుగు ఫలము బొంది, తుదకు విష్ణురూపమును బొందగలడు. ఇందు సందియ మేమియును లేదు.

—౦—

# గీతా ప్రతిభ

## సప్తమాధ్యాయము

శైలనందినీ! ఇపు డేడవ యధ్యాయ మాహాత్మ్యమును జెప్పుచుంటిని. సావధానచిత్తవై యవధరింపుము. ఇయ్యధ్యాయమును విన్నమాత్రముననే మానవు లమృతమయ దేహమును బొందుదురు.

పూర్వము పాటలీపుత్రమను నొక విశాలనగర ముండెను. అందు శంకుకర్ణుడను బ్రాహ్మణు డొకడు నివసించుచుండెను. ఆయనకు నలుగురు పుత్రు లుండిరి. అతడు ధనాశా పీడితుడై వైశ్యవృత్తి నవలంబించి ధనార్జనము సేయుచుండెను. అత డెన్నడును బితృతర్పణముకాని దేవపూజనముకాని చేసియుండలేదు. సర్వకాలములందు నాతడు ధనార్జనముతోడనే జీవితము గడపుచుండెను. ఇటులుండ నొకనా డాతడు మృతకళత్రుడై యుండుటచే నాలుగవ వివాహముజేసికొను దలంపున బంధుమిత్రాదు లందఱితోడను గూడి పయనమై పోవుచుండెను. మార్గమధ్యమున రాత్రిసమయమందు సర్పదష్టుడై యాత డెన్ని చికిత్సలు జేసినను బ్రయోజనము లేక మృతిబొందెను. అట్లు మృతిబొంది యాతడు నరకయాతనల నన్నిటి ననుభవించి యనంతరమున బూర్వజన్మ స్మృతి గల సర్పమై జన్మించెను. ఆ సర్పరూపియగు శంకుకర్ణు డొకనాడు తనలో 'నేను గతజన్మమం దెంతయో ధనము నార్జించి నా గృహమందు బాతి యుంచితిని. నా కుమారులను వంచించి యా ధనమును నేనే కాపాడెదను'

అని చింతించి తనయభిప్రాయమును నానాటిరాత్రి స్వప్నమందు గనబడి తన కుమారున కొక్కనికి దెలియజేసెను. మరుసటి దినమున నాతని కుమారు డా స్వప్నవృత్తాంతమును దన సోదరుల కెఱింగించి వారిని వెంట నిడుకొనియా ధనముగల స్థానము నకు బోయి యచట భూమిని ద్రవ్వ నారంభింప నా సర్పరూపి యగు శంకుకర్ణుడు బుసకొట్టుచు లేచి తన కుమారులతో మనుష్యవాక్కున నిట్లు పలికెను.

మూఢులారా! మీరలెవ్వరు? ఇట కేందులకువచ్చితిరి? ఇచట నేతి నేల త్రవ్వుచుంటిరి? ఇటనుండి యేమి గొనిపోవ దలంచుచున్నారు? అని ప్రశ్నింప, నందొక కుమారు డిట్లు పలికెను — తండ్రీ ! నేను నీ కుమారుడను. నా పేరు శివుడు. రాత్రి స్వప్నమందు నీవు చెప్పిన చొప్పున నిచట గల సువర్ణమును గ్రహించుటకై వచ్చితిని. పుత్రుని వచనము లాలించి శంకుకర్ణుడు 'నీవేనాకు కుమారుడవైనచో నాకీ సర్ప దేహము పోవు నుపాయం బాలోచింపుము. గతజన్మమందు నేను అమితధనాశచే గులధర్మంబుల నన్నిటిని బరిత్యజించి వైశ్యవృత్తి నవలంబించుటచే నాకీ సర్పయోని సంప్రాప్తమైనది' అని పలికెను.

అది విని కుమారుడు 'తండ్రీ ! నీకు విముక్తి యెట్లు గలుగును ? దీని కేమి యుపాయమున్నది? నీ వెట్లు చెప్పిన నట్లు బంధువుల నందఱను నీవద్దకు దీసికొనివచ్చి నేను ప్రయత్నము చేసెదను.' అని పలుక శంకుకర్ణు డిట్లు చెప్పెను — కుమారా ! వినుము. గీతయందలి సప్తమాధ్యాయమును బారాయణము చేయుటవలన దీర్థయాత్ర, దానము, యజ్ఞము

తపము నున్నగువానికంటె నత్యధికఫలము కలుగును. కేవల మొక్క గీతా సప్తమాధ్యాయ పారాయణముచే ప్రాణులు జన్మజరామరణ రూపాత్మకమగు సంసారబంధమునుండి విముక్తి బొందుదురు. కావున నీవు నా శ్రాద్ధదినమున బ్రాహ్మణులచే గీతా సప్తమాధ్యాయ పారాయణము జేయించి యా బ్రాహ్మణులకు తృప్తికరముగా భోజనము పెట్టినచో నిస్సంశయముగా నాకీ సర్పయోని నుండి విముక్తి కలుగును. కనుక నీవు నీ శక్తి కొలది నా శ్రాద్ధదినమున వేదవిదులగు బ్రాహ్మణుల కన్నదానము జేయుము.

ఇట్లు తండ్రి పలికిన వచనముల నాకర్ణించి కుమారు లాతని యాజ్ఞానుసారముగా గీతా సప్తమాధ్యాయ పారాయణము జేయించి వేదవిదులగు బ్రాహ్మణుల కన్నదానము చేసిరి. అట్లు చేసిన వెంటనే శంకుకర్ణుడు దివ్యదేహధారియై ధనమంతను పుత్రుల కప్పగించి వైకుంఠమునకు వెడలిపోయెను.

ఆతని కుమారులును బుద్ధిమంతులై యా ధనమును వెచ్చించి దేవాలయములు కట్టించుట, అన్నసత్రములు స్థాపించుట, మార్గమధ్యమున నీడకై వృక్షములు పాతించుట, బావులు త్రవ్వించుట మొదలగు ధర్మకార్యముల నాచరించిరి. అనంతరమున వారు గీతా సప్తమాధ్యాయమును పారాయణ చేయుచు నంతమునకు మోక్షమును బొందిరి.

కావున నో పార్వతీ! మానవుడు జాతి మత భ్రష్టుడై నీచయోనియందు జన్మించినను సప్తమాధ్యాయమును శ్రవణము జేసిన మాత్రముననే జన్మరాహిత్యమును బొందును.

—o—

## అష్టమాధ్యాయము

దేవీ ! ఇక సప్తమాధ్యాయ ఫలమును గూడ విశదీకరించుచుంటిని, నిశ్చలచిత్తవై వినుము. ఈ యధ్యాయమును శ్రవణము జేయుట చేత నంతఃకరణము పవిత్రంబగును.

దక్షిణదేశమందు దామర్దక పురమను బట్టణ మొకటి యుండెను. అందు భావశర్మయను బ్రాహ్మణు డొకడు వసించుచుండెను. అతడు సదా వేశ్యాలోలుడై తిరుగుచు, మాంసమును భక్షించుచు, మద్యపానము సేయుచు, పరస్త్రీ లాలసుడగుచు సంగమించుచు వేటాడుచు గాలము గడుపుచుండెను. ఆతని జూచి ప్రజలు మిక్కిలి భయము నొందుచుండిరి. ఇటు లుండ నొక నాడాత డధికముగా మద్యమును సేవించుటచే బ్రమత్తుడై భూమిమీదపడి కాలధర్మము నొందెను. పిమ్మట నాత డనేక యమయాతనల ననుభవించి తిరిగి యొక తాళవృక్షమై జన్మించెను. ఇట్లు కాలము గడచుచుండ నొక దినమున భార్యాభర్తలగు బ్రహ్మరాక్షసు లిరువురా తాళవృక్షము నీడయందు విశ్రమింపదలచి యటకు వచ్చి చేరిరి.

అని చెప్పగా పార్వతి యిట్లు పలికెను. — నాథా ! పూర్వము వారేజాతివారలు? వారికీ బ్రహ్మరాక్షసత్వ మెట్లు సంభవించినది. ? వారివృత్తాంతము దెలియజెప్పు డన నప్పరమేశ్వరు డిట్లు చెప్పదొడగెను —

ప్రేయసీ ! పూర్వకాలమున కుశీబలుడను నొక బ్రాహ్మణుడు దుండెను. అతడు వేదవేదాంగము లభ్యసించి సమస్త శాస్త్రంబుల నధ్యయనము జేసి సదాచారుడై మెలగు చుండెను. ఇటులుండ నొకతటి యాతనికి ధనార్జనము జేయు గోటిక గలుగుటచే నతడు మహిషదానములను, అశ్వదానంబులను, గాల పురుషదానంబులను బరిగ్రహింపుచు జీవయాత్ర గడపు చుండెను. అతనికి కుమతి యను భార్య యుండెను. అత డట్లు దానములను గ్రహించుటయే కాని యెన్నడును ఎట్టిధర్మకార్యమును జేసియుండలేదు. కాలవశమున వారిరువురును మృత్యువాత బడి బ్రహ్మరాక్షసులై జన్మించిరి. వారికువురు నటు లా తాళవృక్షముక్రింద కూర్చొని యుండగా నందు భార్య భర్తనుగురించి యిట్లు పలికెను — నాథా ! సర్వజన వినిందితంబగు నీ బ్రహ్మరాక్షసరూపము మన కెట్లు పోవును ? దీనికి దగు సాధన మేమి? బ్రాహ్మణుడావచనంబుల నాకర్ణించి 'మన కీ బ్రహ్మరాక్షసరూపము బ్రహ్మవిద్యోపదేశమువలనను, నాధ్యాత్మికవిచారణవలనను దొలగిపోవును. కాని యింతకన్న నిందులకు వేఱు సాధన మేమియు లేదు' అని ప్రత్యుత్తర మిచ్చెను.

అపుడు కుమతి యప్రయత్నముగా 'కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మమ్' అని ప్రశ్నించెను. (అనగా) ఆ బ్రహ్మ మెవరు? ఆ యధ్యాత్మ మెయ్యది? ఆ కర్మ మేమిటి ? యని ప్రశ్నించెను. గీతాష్టమాధ్యాయ మందలి ప్రథమశ్లోకభాగంబగు నీ వాక్యమును విన్నంతనే తాళవృక్షరూపమున నున్న భావ

శేగన్నయు,బఠించుటచే బ్రహ్మరాక్షస రూపమందున్న కుమతియు కుశీబలుడును విముక్తులై స్వస్వరూపంబులను దాల్చిరి. అందు కుమతి కుశీబలులు మాత్రము దివ్యవిమానముల నారూఢులై వైకుంఠమునకు వెడలిపోయిరి. అదిచూచి భావశర్మ యాశ్చర్య చకితుడయ్యెను. అనంతరమున భావశర్మ యా యర్ధశ్లోకమును జపించుచు భగవంతు నారాధించుటకై కాశికిబోయి యచట శ్రీహరిని గురించి ఘోరతపము జేయ నారంభించెను. ఆ సమయమున వైకుంఠమందు లక్ష్మీదేవి విష్ణుమూర్తి నిట్లు ప్రశ్నించెను — నాథా! మీరు సదా నిద్రనుగూడ విడచి యిట్లేల జింతించుచుండిరి ? అపుడు శ్రీహరి యిట్లు అనియెను — ప్రేయసీ ! కాశీనగరమందు భావశర్మ యను బ్రాహ్మణుడు నా యందమితభక్తి కలిగిఘోరముగా దపమాచరించుచుండెను. ఆతడు దేహమునుగూడ మఱచి గీతాష్టమాధ్యాయ మందలి యర్ధశ్లోకమును "కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం, కిం కర్మ పురుషోత్తమ" యను మంత్రమును జపించుచున్నాడు. నే నాతని తపమునకు దగిన ఫలము నేమి ప్రసాదింతునా ? యని యాలోచించు చుంటిని.

ఇట్లు పలికి విష్ణుమూర్తి భావశర్మయెడ దయగలవాడై యాతనికి మోక్షము ననుగ్రహించెను. ఆభావశర్మ వలన నరకపతితు లగు నాతని వంశజులందఱుగూడ దరించిరి.

కావున గీతాష్టమాధ్యాయ పారాయణమువలన బ్రహ్మ రాక్షసత్వము, వృక్షత్వము దొలగిపోవుటయే కాక ముక్తియు గూడ దప్పక గలుగును. సందేహము లేదు.

—o—

## నవమాధ్యాయము

దేవీ పార్వతీ ! సాదరముగ నిప్పుడు తొమ్మిదవ యధ్యాయ మాహాత్మ్యమును జెప్పుచుంటిని వినుము.

నర్మదాతీరమున మాహిష్మతి యను పట్టణమొండు కలదు. ఆపురమున వేదవేదాంగవిదుడును, నతిథిపూజానిరతుడు నగు మాధవుడను నొక బ్రాహ్మణుడుండెను. అతడు చాల ధనమార్జించి యొక యజ్ఞము చేయ నారంభించెను. ఆత డా యజ్ఞమందు బలికొఱకై యొక మేకను గొని తెచ్చి దానికి బూజాదిక మాచరించెను. పిమ్మట నా మేకచిరునవ్వు నవ్వుచు సభయాంతయు నాశ్చర్య మొందునటుల మనుష్య వాక్కుతో నిట్లు పలికెను,

ఓ బ్రాహ్మణోత్తమా ! "ఈ యజ్ఞము వలన లాభ మేమి ? ఇయ్యజ్ఞ ఫలము పూర్తికాగానే మఱల జనన మరణ ములు నిశ్చితము లే కదా! ఇంతియే కాక నీ వీ యజ్ఞమిట్లాచ రించుటచే నా దశయే నీకును సంప్రాప్తించ గలదు. నా యీ రూపమును జూడుము." — ఇట్లు లా మేక వచనములను విని సభికులందఱు నాశ్చర్య చకితులైరి. ఋత్విక్కులు మున్నగు వారు నమస్కారపూర్వకముగా నా యజము (మేక) తోడ నిట్లు పలికిరి. —

ఓ యజమా ! పూర్వజన్మమందలి నీ వృత్తియేమి ? నీ కే కర్మఫలంబుచే నిట్టి దశ సంప్రాప్తించినది ! నీకు బూర్వ

జన్మస్మృతి యెట్లు కలిగినది ? ఇది యంతయు సవిస్తరముగా వినగోరుచుంటిమి.

ఓ బ్రాహ్మణోత్తములారా ! పూర్వము నే నొక పరమపూతమగు బ్రాహ్మణకులమందు జన్మించి యఖిల వేదముల నభ్యసించి సర్వవిద్యావిశారదుండ నైతిని. ఇటులుండ నొకసారి నా పుత్రుడు రోగపీడితుడగుట భార్యచే బ్రేరితుడనై వాని రోగ నివారణార్థము చండికకు బలి నిచ్చుటకై యొక యజమును గొనితెచ్చి బలి యిచ్చితిని. ఆ సమయమున దాని తల్లి వచ్చి నన్ను జూచి 'ఓరీ పాపాత్మా ! దుర్మార్గా! నీవు నా పిల్లను బలి యిచ్చితివి కావున దిరిగి మేకయోని యందు జన్మింతువు గాక !' యని నన్ను శపించెను. కాల వశమున మృతిబొంది నరకయాతనల ననుభవించి పిమ్మట మేకనై జన్మించితిని. పశుయోనియందు జన్మించినను నాకు బూర్వజన్మ స్మృతి కలదు. ఇంతకన్న నాశ్చర్యజనకమగు విషయ మొండు కలదు. నేనొక సమయమున గోతినై బుట్టి పాములవానిచే జంపబడి మఱల శునకమునై జన్మించి పవిత్ర పదార్థంబులను దాకుటచే నొక బ్రాహ్మణస్త్రీచే జంపబడితిని. అనంతరమున నశ్వమునై యుద్భవించి యొక రాజభారమును మోయుచు నొకచో బురదయందు దిగబడి మృతి బొంది మఱల నీకీతిగా మేకనై జన్మించితిని. ఓయీ ! విప్రోత్తమా ! నీకు వినవలయు నను గుతూహల మున్న జెప్పుచుంటిని వినుము.

పూర్వము మోక్షసంధాయకం బగు గురుక్షేత్రమును జంద్రశర్మ యను సూర్యవంశపురాజు పాలించు చుండెను.

అతం డొకదినమున సూర్యగ్రహణ పర్వము సంభవింప శ్రద్ధతో గాలపురుష దానము జేయదలచి వేదవేదాంగ పారగుడగు బ్రాహ్మణు నొకని రావించెను. పురోహితుని వెంటనిడుకొని నది కేగి స్నానమాచరించి తిరిగి గృహమునకు వచ్చి గంధ పుష్ప మాల్యాదికముచే నా బ్రాహ్మణుని బూజించి యథావిధిగా గాలపురుష దానము జేసెను.

తత్క్షణంబు యీ కాలపురుష విగ్రహమునుండి యొక చండాలమిథున ముద్భవించి దానమును గ్రహించిన బ్రాహ్మణుని హృదయమున బ్రవేశింపబోయెను. తోడనే యా బ్రాహ్మణుడు మానసమందు శ్రీ హరిని ధ్యానించి శ్రీమద్భగవద్గీతా నవమాధ్యాయమును బారాయణ జేయ మొదలిడెను. ఆ సమయమున శ్రీ మహావిష్ణువాతని హృదయపీఠము నలంకరించి యుండుటచేనా చండాలు రాతని హృదయమున బ్రవేశింపలేక పోయిరి. గీతా నవమాధ్యాయ మందలి యక్షరము లాతని ముఖమునుండి వెలువడుచుండ నొక్కొక్క యక్షరంబున కొక్కొక విష్ణుదూత యావిర్భవించి యా చండాల దంపతులను దూరముగ బాఱద్రోలిరి. ఇది చూచి రాజు విస్మితుడై బ్రాహ్మణుని తోడ నిట్లు పలికెను.

భూసురోత్తమా ! ఇట్టి భయంకర సమయమున నిన్నెవరు కాపాడిరి ? నీవు ఏ మంత్రమును జపించితివి ? ఆ చండాలదంపతు లెవరు ? వారిట్లు శాంతి బొందుటకు గారణ మేమి? ఈ వృత్తాంతము నంతయు బూర్ణముగా వినదలచు చుంటిని.

అపుడు బ్రాహ్మణు డిట్లు పలికెను. రాజా! వారిద్దఱు మహా పాపాత్ములు. కాలపురుష దాన గ్రహణ దోషముచే నా హృదయమును బ్రవేశింప బ్రయత్నించిరి. అపుడు నేను గీతానవమాధ్యాయ మంత్రమును జపించితిని. ఇది యంతయు నా మంత్రప్రభావమే. భూపాల ! నవమాధ్యాయ పారాయణ ముచే నెట్టి కష్టములనైనను దరింపవచ్చును. నిత్యము నే నీ యధ్యాయమును పారాయణ జేయుచుంటిని. అందువలన నాచే నాచరింపబడు ప్రతిగ్రహణదోషము లన్నియు నశించినవి. అది విని రాజు మిక్కిలి సంతసించి యా బ్రాహ్మణుని వలన గీతా నవమాధ్యాయము నుపదేశమొంది నిత్యము భక్తితో పారాయణ జేయుచు నంతమునకు దానును బ్రాహ్మణుండును బరమపదమును బొందిరి. ఈ ప్రకారము మేకచే జెప్పబడిన వృత్తాంతమునాకర్ణించి యాబ్రాహ్మణుడుగూడ దానినిజంపుట మాని నిత్యముభక్తితో గీతానవమాధ్యాయమునుపారాయణ జేసి యంతమునకు బరమపదమును బొందెను.

కావున గీతా నవమాధ్యాయ పారాయణమువలన బ్రతి గ్రహణ దోషము నశించుటయే కాక చివరకు ముక్తికూడ సంప్రాప్తించును.

—o—

# గీతా ప్రతిభ

## దశమాధ్యాయము

పార్వతి:- సర్వజ్ఞ ! తమ యనుగ్రహమువలన సత్యైశ్వర్యజనకమగు నవమాధ్యాయ మాహాత్మ్యమును శ్రవణము జేసితిని. కాని తృప్తికలుగుట లేదు. కావున దశమాధ్యాయ మాహాత్మ్యమును గూడ సవిస్తరముగా నుపదేశింపుడు.

పరమేశ్వరుడు:- సుందరీ ! పరమ పావనమగు దశమాధ్యాయ మాహాత్మ్యమును విన్నమాత్రముననే స్వర్గము లభించగలదు. కావున సాదరముగా వినుము.

పూర్వము కాశీపురమున ధీరబుద్ధియను నొక బ్రాహ్మణుడుండెను. ఆతడు వేదశాస్త్రములందు బూర్ణప్రజ్ఞ కలవాడు, నందీశ్వరుని వలె బరమేశ్వరుని యందు భక్తి కలవాడునై యింద్రియములను వశమొనర్చుకొని మోక్షమార్గమందు బ్రవర్తించుచుండెను. అతడు మానసము నంతరాత్మయందు నిలిపి యెల్లవేళల నాత్మసాక్షాత్కారము జేసికొనుచుండును. అందువలన నాత డెప్పుడెచటికి బోవుచున్నను నే నాతని వెంట బోవుచుందును. ఈ నా స్థితిని భృంగిరీటుడు చూచి నన్నిట్లు ప్రశ్నించెను— 'స్వామీ ! మీ రీ విధముగ నాతని వెంబడించి పోవుటకు గారణమేమి? వారి యెడల నధిక వాత్సల్యమున్నచో మీ రాతనికి దర్శన మీయరాదా ? ఆతం డెట్టి తపోదాన యజ్ఞములు చేసెను?' అనుగ్రహింప బ్రార్థించు చుంటిని.

పూర్వము కైలాసమున బున్నాగవనమున వెన్నెల రాత్రి యందొకచో గూర్చొని యుంటిని. ఆ సమయమున ప్రళయకాలమందు వలె భీకరముగా వాయువు వీచుచుండెను. భయంకరధ్వనులతో వృక్షములు నేలగూలుచుండెను. పర్వతములను గూడ జలింపజేయునో యనునట్లు ఝంఝామారుతము నలుదెసల వ్యాపించి యుండెను. అప్పు డాకసమందుండి కాలమేఘమువలెను, గాటుకకొండవలెను, నంధకారమువలెను నల్లని వర్ణముగల యొకపక్షి నా వద్దకు వచ్చి చక్కగ వికసించిన యొక పద్మమును నా ముందుంచి శిరసా ప్రణామము జేసి యిట్లు స్తుతించెను.

పరమేశ్వరా ! నమస్కారము. నీవు జితేంద్రియులగు భక్తుల కధీనుడవు, నిరాకారుడవు, నిరామయుడవు, నిర్గుణుడవు, సృష్టి స్థితి లయ కారకుడవు. నీ తృతీయ నేత్రాగ్నిచే మన్మథుని భస్మీభూతుని గావించితివి. జయ మగు గాక !! ఎల్లవేళల మును లందఱిచే గీర్తింపబడు నీ పాదారవిందములకు నమస్కారము. దేవగురు వగు బృహస్పతియు, సహస్రవదను డగు నాదిశేషుడును గూడ నిన్ను స్తుతింప సమర్థులు కారు.

ఇటు లా స్తోత్రము నాకర్ణించి ' కాకివలె నల్లని దేహమును, హంసవలె శరీరాకారమును ధరించి యున్న నీ పూర్వవృత్తాంత మేమి? ఏ ప్రయోజనము నుద్దేశించి నీ విచటకు వచ్చితివి ?' అని పరమేశ్వరుడు ప్రశ్నింప నా పక్షి యిట్లు చెప్పదొడగెను.

ధూర్జటీ ! నేను చతురాననుని హంసను. నా యీ దేహమునకు నీలవర్ణము సంభవించిన కారణమును జెప్పుచుంటిని వినుము. సర్వజ్ఞులరగు మీకు దెలియని విషయము లుండ నేరవు. అయినను దమ యనుగ్రహమున వచించు చుంటిని. సౌరాష్ట్ర దేశమున (సూరత్) బద్మములచే నలంకరింపబడిన సుందరమగు నొక సరోవరము గలదు. బాల చంద్రుని వలె మృదువైన తామరతూండ్ల నాహారముగా గైకొని నే నొక నా డాకసవీధిని బోవుచు బ్రమాదవశమున భూమిపై బడితిని. స్పృహ తప్పినది. కొంత సేపటికి సేద దేఱి యిట్లు చింతించితిని—నా యీ పతనమునకు గారణ మేమి? నా దేహమం దీ కాలిమ (నలుపు) ఎట్లు సంభవించినది? ఇంతలో నా సమీపమం దున్న సరోవరమందలి పద్మముల మధ్యనుండి 'ఓయి విహంగమా ! లెమ్ము. నీ పతన కారణమును జెప్పెదను' అని యొక వాక్యము వినబడెను. వెంటనే నేనా సరోవర మధ్యమునకు వెడలి యచట నైదు పద్మములు కల యొక పద్మలతను జూచి నమస్కరించి నా పతన కారణము నడుగ నిట్లు చెప్పెను.

ఓ కలహంసమా ! ఆకసవీధి నెగురుచు నన్ను దాటి నీవు వెడలితివి. ఆపాపపరిణామముచే భూమిమీద బడుటయు, నీ దేహమునకీ కాలిమము గల్గుటయు దటస్థించినది. ఈ పతనమును జూచి నాకు దయగలిగి యెదుటనున్న పద్మముతో సంభాషించుచుండ నా ముఖసౌరభము నాఘ్రాణించినంత నే యఱువది వేల తుమ్మెదలు స్వర్గమును బొందినవి. నా యందీ

యిలౌకిక శక్తి జనించుటకు గారణమును నుడివెదను వినుము. ప్రథమమున తుమ్మెదల వృత్తాంతమును జెప్పుచుంటిని.

ఆ తుమ్మెద లిప్పటి కేడు జన్మలకు బూర్వము ముని కుమారులై యుండిరి. వారందఱు నీ సరస్తీరమున దప మాచరించు చుండిరి. ఒక సమయమున నపర సరస్వతియో యన నొప్పు నొక స్త్రీ వీణ మీటుచు నీ ప్రాంతమున సంచరించు చుండెను. శ్రవణమనోహరంబగు నా ధ్వని నాలకించిముని కుమారు లందఱామెను సమీపించి 'నేనే ముందు జూచితిని, నేనేముందు జూచితిని' అని యొండొరులు గలహించుకొని ముష్టిఘాతములచే బరస్పరము దన్నుకొని మృతి బొందిరి. అనంతరమున దమతమ కర్మానుసారముగా యమయాతనల ననుభవించివారు మఱల భూమిమీద బెగ్గురుపక్షులై యుద్భవించిరి. పిమ్మట గాలవశమున దావాగ్నిదగ్ధులై నారు తిరిగి గజములై జన్మించి మార్గమున పోవు బాటసారులను జంపుచు బ్రమాదవశమున నావనమందొకచో విషజలమును ద్రావిమఱల యమాలయమున కరిగిరి అనంతరమున దిరిగి వారందఱు ఖరము, ఒంటె, తోడేలు, పిల్లి మొదలగు జన్మము లనెత్తి యంతమునకు దుమ్మెదలై జన్మించి నామముఖగంధమునాఘ్రాణించి విష్ణులోకమునుబొందిరి.

పక్షీంద్రా! నా యీ యైశ్వర్య కారణమును జెప్పెదను. వినుము. ఇంతకు బూర్వము మూడవ జన్మయందు నేనొక బ్రాహ్మణ పుత్రికను. నా నామము సరోజవదన. నేను మిక్కిలి భక్తితో బెద్దల సేవ జేయుచు పాతివ్రత్యమునే ప్రధానముగా బాటించుచు గాలము గడుపుచుంటిని. నేనొక

దినమున 'మైన' యను పక్షిచే బాధము జనిపించు చుండ బతి సేవయందు గొంచె మాలస్య మయ్యెను. అందులకు నా భర్త కుపితుడై నన్ను 'మైనా పక్షివి కమ్ము' అని శపించెను. వెంటనే నేను మైనా రూపమును బొంది గతజన్మయందలి పతి ప్రతా ప్రభావముచే నొక ముని గృహమందు వసించు చుంటిని. అచట మునికన్య యొకతె నన్ను బెంచు చుండెను. ఆ గృహ యజమాని నిత్యము విభూతి రూపాత్మకంబగు గీతా దశమా ధ్యాయమును బారాయణ జేయుచుండెను. సర్వ పాప పరి హారకంబగు నాయధ్యాయము నేను నిత్యము శ్రవణము జేయు చుండెడి దానను. కాలవశమున మృత్యుముఖము జొచ్చి స్వర్గ మందొక యప్సరసనై జన్మించితిని. నా పేరు పద్మావతి. కాల క్రమమున నేను లక్ష్మికి చెలికత్తె నైతిని. ఒక దినమున విమానము నధిష్ఠించి యాకసమందు విహరించు చుండ బద్మ ములచే రమణీయంబగు నీ సరోవరమును గాంచి యిందు విహరించు చుంటిని. ఇంతలో మహాకోపావతారుగుడ దూర్వాసు డేతెంచుచుండ జూచి భయమొంది యాతడు వచ్చు నంతలో వస్త్రవిహీనురాల నగు నే నొక పద్మలతారూపమును ధరించితిని. ఇదిగో, నైదు పద్మములు గల నన్ను జూడుము. ఇందు రెండుపద్మములు పాదములు. రెండుపద్మములు హస్తములు. ఒక పద్మము ముఖము. ఇట్లు పద్మలతా రూప మును దాల్చిన నన్ను జూచి దూర్వాసుడు కోపాక్రాంతుడై ఓసీ! దురాత్మురాలా! 'నీవు యీ రూపముచే శత వత్సరము లుందువుగాక,' అని శపించి యంతర్హితు డయ్యెను. పూర్వ జన్మమున విభూతి యోగాధ్యాయమును శ్రవణము జేయుటచే

నీజన్మమున నిట్టి రూపముండియు వాక్కు గలిగియుంటిని. అట్టి శక్తిగల నన్ను నీవంతరిక్షమున బోవుచు నతిక్రమించుటచే (దాటుటచే) నేల గూలితిని. నా యెదుట నుండగనే నీకు శాప విముక్తి కాగలదు. నాకును శాపావధిసమీపించినది. నే నిపుడు దశమాధ్యాయమును బారాయణ జేసెదను. నీవుకూడ నాకర్ణిం పుము. ఇట్లు పలికి యా పద్మలత దశమాధ్యాయమును బారా యణ జేసి ముక్తిబొందెను. ఆ సమయమున నా పద్మలతచే నీయబడిన పద్మమును గైకొని యిట్లు నీవద్దకు వచ్చితిని. ఇటు లీశ్వరునితో బలికి యా హంసయు ముక్తిని బొందెను.

ఈశ్వరునివచనములాకర్ణించి భృంగిరీటుడు ఇట్లు ప్రశ్నిం చెను—పరమేశ్వరా ! పూర్వజన్మమున నీ హంస యెవ్వరు? నీయెదుట నిట్లు దేహమును ద్యజించి ముక్తిబొందుటకు గారణ మేమి? ఈ వృత్తాంతమును వినగోరుచుంటిని.

భృంగీశ్వరా! పూర్వ మొక బ్రాహ్మణకులమున సుతపు డను వా డొక డుండెను. అతడు బ్రహ్మచారి. జితేంద్రియుడు. గురుకులమున నెక్కుడు గురుశుశ్రూష జేసి వేదంబుల నభ్య సించెను. ఒకదినమునగురువునిదురించు చుండగానాతనిశయ్యను సుతపుడు తన పాదముచే దాకెను. స్వర్గమును బొందియు నత డా పాపముచే దిర్యగ్యోనియందు హంసయై జన్మించి బ్రహ్మ దేవుని హంసలలో నొకటిగా బరిగణింపబడుచుండెను. పిమ్మట నా పద్మలతచే జెప్పబడినదశమాధ్యాయప్రభావమువలన నొక బ్రాహ్మణుడై జన్మించెను.పూర్వజన్మసంస్కారవశమునన తడు బాల్యమునుండియు దశమాధ్యాయమును బఠించుట నభ్యసిం

చెను. దాని ప్రభావము వలననే ఇతడు సర్వదా శ్రీమహా విష్ణువును సందర్శించుచుండును. ఈ దృష్టి ప్రసరణ మాత్రమున బంచమహాపాతకులు కూడ ముక్తి బొందుదురు. అతడీపురమం దుండుటచే వారలందఱకు ముక్తి కరతలామలకము. అందువలన నేను సదా యాతని కరమును గ్రహించి వెంట బోవుచుందును. భృంగిరీటా! భగవద్గీతా దశమాధ్యాయ మాహాత్మ్య మిట్టిది.

పార్వతీ! భృంగిరీటునకు జెప్పిన యితిహాసము నంతను వింటివి కదా! బాలుకు కాని, స్త్రీలు కాని, పురుషులు కాని యెవ్వ రీ దశమాధ్యాయమును నిత్యము భక్తితో శ్రవణము జేయుదురో, బఠింతురో, యట్టివారు సర్వాశ్రమధర్మముల నాచరించిన ఫలమును బొందుదురు. మఱియు తిర్యగ్యోనులందుండియు జ్ఞానవంతులై తుదకు మోక్షమును బొందుదురు.

— ♦ —

# గీతా ప్రతిభ

## ఏ కా ద శా ధ్యా య ము

ప్రేయసీ ! గీతా శ్రవణ కుతూహలివగు నీవిపుడు పరమ పవిత్రంబును, విశ్వరూపాత్మకంబు నగు నీ యేకాదశాధ్యాయ మాహాత్మ్యమును వినుము. దానిని గురించిన యితిహాసంబు లనేకములు గలవు. అందిది కూడ నొక యితిహాసము.

ప్రణీతా నదీతటమందు మేఘంకరమను నొక విశాల నగరముండెను. ఆ నగర మనేక ప్రాకార గోపురంబులతోడను, బంగారు స్తంభములచే నిర్మితమైన ధర్మశాలలతోడను శోభిల్లు చుండెను. అందు ప్రజలుసుఖవంతులు,ధనవంతులు,శాంతులు, జితేంద్రియులునై వర్తించుచుండిరి. మేఘశ్యామల దేహుండును, వామనాకారుండును, శ్రీవత్స లక్షణలక్షితుండును, శారఙ్గధను ర్ధరుండు నగు శ్రీమహావిష్ణు వా పురమందు వసించి పౌరు లందఱకు నిత్యసుఖంబులనిచ్చుచుండెను. అచటిపురజనులందఱు నిత్యము నా శ్రీహరిని సందర్శించి సంసార భయవిముక్తులగు చుండిరి. ఆ పురమున మేఖల యను నొక పుణ్యతీర్థముండెను. అందు స్నాన మాచరించుటచే మనుజులకు శాశ్వత వైకుంఠము సంప్రాప్తించును. అచటనున్న శ్రీనృసింహు నొకమాఱు సంద ర్శించినచో మనుజుం డేడు జన్మముల పాపమంతయు నశించి

పరమపదమును బొందును. అచటగల వినాయకుని జూచినచో సర్వవిఘ్నములు నశించిపోవును.

ఆ పురమందు సదా బ్రహ్మచర్యనిరతుండు, మమతా రహితుడు, జితేంద్రియుడు, వేదవేదాంతపారగుడు, శ్రీహరి శరణాగతభక్తుండు నగు సునందుండనునొకభూసురుండుండెను. అతడు నిత్యము శ్రీహరిసాన్నిధ్యమున గీతయందలి విశ్వరూపా త్మకంబగు నేకాదశాధ్యాయమును బారాయణ జేయుచుండెను. అందుచేత నాత డత్యల్పకాలమున బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుడై పరమానంద సందోహంబగు సమాధివలన నింద్రియములను వశమొనర్చుకొని, నిశ్చలుడై యుండి జీవన్ముక్తుడని పిలువబడు చుండెను.

బృహస్పతి సింహరాశిని బొందియుండనొక నా డాతడు గోదావరీ తీర్థయాత్ర జేయు దలంపున గృహమునుండి పరివార ముతో పయనమై క్రమముగా దారాసంగమతీర్థము, కపిలా సంగమ తీర్థము, అష్టతీర్థము,కపిలాద్వారము, నృసింహవనము, అంబికాపురము,కరస్థానము మొదలగు బుణ్యతీర్థములను సేవించి వివాహమండపమును బురము జేరెను. అత డాపురమందానాటి కెవరియింటనైన వసింపదలచి తిరుగుచుండ గ్రామాధికారివచ్చి యొక ధర్మశాల నాతనికి జూపి అందు వసింపుమని చెప్పి వెడలి పోయెను. సునందుడును దన పరివారముతోడ నందు బ్రవేశించి నిర్భయముగా నాదివసమును గడపెను. మరుసటి దిన ముదయ మున మరల గ్రామాధికారివచ్చి వారలను జూచి యాశ్చర్య

బడి 'మహాత్మా! మీరందఱు జిరాయువులు, బుణ్యపురుషులు, పవిత్రహృదయులు. మహనీయా! ఈ గృహమున మీకేమియు భయము కలుగలేదా? మీ రిందు జీవించి యెటులుండగలిగితిరి? మీవంటి వారిని నేనెచటను జూడలేదు. మీయందెట్టి మంత్ర ప్రభావ మున్నది? మీరు ఏ విద్యనాశ్రయించి యే దేవు నుపాసనజేసి యీ యలౌకిక శక్తిని సంపాదించితిరి? మహోదయా! తా మీగ్రామమందే వసింపుడు. నేను మీకు ప్రతిదినము సేవ జేయుదును' అని పలికెను. అటు లా గ్రామాధికారి వచనాను సారముగా సునందు డా గ్రామమందే సపరివారుడై వసించు చుండెను.

ఇటు లేడెనిమిది దివసంబులు గడచిన పిమ్మట నొకనా డుదయమున గ్రామపాలుడు సునందుని వద్దకువచ్చి రోదనము జేయుచు 'మహాత్మా! గడచిన రాత్రి నా కుమారుని నొక బ్రహ్మరాక్షసుడు భక్షించెను.' అని పలుకుచుండ సునందుడు 'గ్రామపాలా! ఆ బ్రహ్మరాక్షసు డెవండు? ఆత డెచట నివసించుచున్నాడు. నీ కుమారు నతం డెట్లు భక్షించెను?' అని ప్రశ్నించెను.

అపుడు గ్రామాధికారి యిట్లు చెప్పదొడంగెను— భూసురోత్తమా! ఈ గ్రామమందు నర భక్షకుండగు నొక బ్రహ్మరాక్షసుడు గలడు. ఆతడు ప్రతిదినము నగరమందు బ్రవేశించి యిష్టమువచ్చినటుల మనుజుల నందఱను భక్షించు చుండెను. అది చూచి మేమందఱ మాతని నిట్లు ప్రార్థించి తిమి— 'ఓ రాక్షసా! నీవు మమ్ములను రక్షింపుము. నీ

యాహారము కొఱకై మేమొక యేర్పాటు గావింతుము. మార్గవశమున నీ గ్రామమునకు వచ్చు పథికులను నీ యాహారము కొఱకై యీ ధర్మశాలకు బంపుచుందుము. నీవు వారిని భక్షించుచుండుము. అటు లీధర్మశాల కెవ్వడును రానిచో నాడు నీవు గ్రామమందు ప్రవేశింపుము. ఇంతియే మా ప్రార్థన. అతడును మా ప్రార్థనను విని యట్లే యగుగాక' యని వెడలిపోయెను.

నాటి నుండియు నట్లే జరుగుచుండెను. నేడు మీరీ ధర్మశాలయందు సుఖముగా నుండగలిగితిరి. మీ రెంత ప్రభావ పూర్ణులో కదా! భూసురోత్తమా! రాత్రి మార్గవశమున నాకుమారుని మిత్రుడొకడు రాగా నాతని నీ ధర్మశాలకు బంపితిని. వానియందలి ప్రేమవశమున నా కుమారుడు కూడ యుండె బండు కొనగా బ్రహ్మరాక్షసుడు అతనితో బాటు నా కుమారుని గూడ భక్షించెను. నేను విచారించుచు నేటి యుదయమున నా బ్రహ్మరాక్షసుని కడకు బోయి 'ఓరీ దుష్టాత్మా! రాత్రి నా కుమారుని గూడ భక్షించితివేమి? ఇపుడు నా పుత్రు డెట్లు జీవించును? ఉపాయ మేమి ?' యని యడుగగా నతడిట్లు చెప్పెను.

గ్రామపాలా! రాత్రిసమయమున జీకటి యగుటచే నీ కుమారుని భక్షించితిని. అతడు జీవించుట కొక యుపాయము కలదు. గీత యందలి యేకాదశాధ్యాయమును బారాయణ జేయుచు నభిమంత్రించిన జలముచే నాకీ రాక్షసత్వము పోవుటయే కాక యింతదనుక నాచే భక్షింపబడిన వారందఱు

గూడ జీవించి ముక్తిఁ బొందుదురు. నే నొక దినమున ధర్మశాలలోఁ బ్రవేశించగా నచట నొక బ్రాహ్మణుఁడు గీతయందలి యేకాదశాధ్యాయమును బారాయణ జేయుచుండెను. ఆ బ్రాహ్మణుఁడు నాయందనుగ్రహించి యేడుమాఱులు గీత యేకాదశాధ్యాయమును బారాయణము జేసి జలమునభిమంత్రించి నామీఁద జల్లినచో నేనును నా యుదరమందలి జీవులంఱును దరింతుము. కావున నో గ్రామపాల! నీ వీ వృత్తాంతము నా బ్రాహ్మణున కెఱింగించి మమ్ముల నుద్ధరింపుము.

అనవుఁడు, నేను మఱల 'నోరీ పాపాత్మా! నీ వాక్యములను వినుచుండ నా కాశ్చర్య మొదవుచున్నదే! ఏకాదశాధ్యాయ మం దట్టి ప్రభావ మెచట నున్నది?' యని యడుగ నాతం డిట్లు పలికెను.

ఓ గ్రామపాలా! పూర్వ మొక గృధ్ర మొక యస్థిఖండమును నోటఁగఱచుకొని నభోమార్గమున బోవుచుండెను. దైవవశమున నా గృధ్రము నోటినుండి జారి యా యస్థిఖండ మొక జలాశయమందు బడెను. ఆ సమయమున నొక మునీశ్వరుఁ డా జలాశయమును మహాతీర్థముగా భావించి యందలి జలముచే దన పితృదేవతలకు దర్పణ మొనర్చుచుండెను. అదిచూచి కొందఱుజనులా మునీశ్వరు నిట్లడిగిరి — మునీశ్వరా! ఈ జలాశయము పుణ్యతీర్థ మెటులైనది? మీ రిందు దర్పణము జేయుచుంటి రేల? అనఁడు, మునీశ్వరు డిట్లు పలికెను. విత్తవానుఁడను బ్రాహ్మణుఁ డొకడు నిత్యము గీతయందలి యేకాదశాధ్యా

యమును బారాయణ జేయుచుండెను. కాలవశమున నాతడు మార్గమధ్యమున జోరులచే జంపబడెను. అతని యస్థిఖండమును నొక గృధ్రము నోటగఱచుకొని పోవుచుండ నదిజారి యీజలాశయమందు బడినది. ఏకాదశాధ్యాయమును బారాయణ జేయు పుణ్యపురుషుని యస్థిఖండ మగుటచేత నీ జలాశయము పుణ్యతీర్థమైనది. నాటినుండియు నీ జలాశయమును పుణ్యతీర్థముగ భావించి జనులందఱు నందు స్నాన మాచరించుచుండిరి. అటులాబ్రహ్మరాక్షసుని వచనానుసారముగా మీసన్నిధికేతెంచితిని. అని గ్రామపాలుడు పలుక తిరిగి సునందు డిట్లనెను.

'గ్రామపాలా! అతని కాబ్రహ్మరాక్షసత్వ మెట్లుసంభవించినది?' అని ప్రశ్నింప, మరల గ్రామపాలు డిట్టు లనెను- బ్రాహ్మణోత్తమా! పూర్వ మీ గ్రామమందు గృషీవలు డను బ్రాహ్మణుడు కలడు. అత డొక సమయమున తన పొలమును గాపాడుకొనుచుండ నమ్మార్గమున పోవు పథికు నొకనిని గ్రద్ద యొకటి పొడిచి చంపుచుండెను. అదిచూచి యా సమీపమందున్న మునీశ్వరు డొక డీబ్రాహ్మణునితో 'రక్షింపుము. రక్షింపుము. పాపము! గ్రద్దపొడిచి చంపుచున్నది' అని యఱచుచు నా సమీపమునకు వచ్చునంతలో నా గ్రద్ద యాతని జంపి యాకసమున కెగసిపోయెను.

అపుడు మునీశ్వరు డా కృషీవలుం డగు బ్రాహ్మణుని జూచి 'ఓ పాపాత్మా! నీ వతి కఠిన చిత్తుడవు. నిర్దయుడవు. సమీపమం దుండియు నీవు నీ ప్రాణమువంటి వేఱొక ప్రాణ

మును గాపాడలేకపోతివి. జీవులు మనుజులవలనను, బశువుల వలనను హింసింపబడుచుండగా నెవ్వ డుదాసీనుడై యుండునో, ఆతడా జీవులజంపిన పాపము ననుభవించును. సమర్థుడయ్యు నెవ్వ డట్టియాపదనుండి జీవులను సంరక్షింప కుండునో, అతడు తిరిగి నీచయోనియందు జన్మించును. అట్టి యాపత్సమయమున నెవ్వడు దూరమం దుండి యైనను 'రక్షింపుము, రక్షింపుము' అని పలుకునో, అట్టి వారుత్తమ గతులను బొందుదురు. దుష్ట మృగము బారినుండి గోవులు మొదలగువాని నెవ్వడు సదయుడై కాపాడునో, యాతడవశ్యముగ బరమ పదమును బొందును.

అశ్వమేధ సహస్రాణి వాజపేయ శతాని చ
శరణాగత సంత్రాణ కలాం నార్హంతి షోడశీమ్.
దీనస్యోపేక్షణం కృత్వా భీతస్య చ శరీరిణః,
పుణ్యవా నపి కాలేన కుంభీపాకే సపచ్యతే।

పద్మపురాణము, ఉత్తరఖండము,

వేయి యశ్వమేధములు, నూరు వాజపేయములును గలసి యొక శరణాగత రక్షణఫల మందలి పదియారవ యంశమునకైనను సాటి రావు. ఎవడు దీనుని, భయభీతుని రక్షించక నుపేక్షించునో, అతడు పుణ్యాత్ముడయ్యు గుంభీపాక మను నరకమున బడును. రక్షణ జేయ సమర్థుడయ్యును ఎవడు నిర్దయుడై యూరకుండునో, యాతడు రాక్షసుడై జన్మించును. కావున నీవును రాక్షసుడవై జన్మింతువుగాక !' యని శపించెను. అంతట గృహీవలుడు వినమ్రుడై ఋషీశ్వరు నితో నిట్లు పలికెను — మహాత్మా ! నాకీ విషయ మెంత

మాత్రము దెలియదు, నేను నా క్షేత్రమును గాపాడుకొనుటయందేకాగ్ర మనస్కుడనై యుంటిని. కావున నన్ననుగ్రహింప వేడుకొనుచుంటిని.

ఓయి కృషీవలా ! ఎవనిచే నిత్య మేకాదశాధ్యాయము పారాయణ జేయబడునో, ఏడు మాఱులా యధ్యాయ పఠనముచే నభిమంత్రితమైన యాతని జలము వలన నీకు శాప విముక్తి కలుగ గలదు—నాటినుండియు నతడిట్లు రాక్షస రూపముతో నీ గ్రామమున నివసించు చుండెను. ఓ బ్రాహ్మణోత్తమా ! అతనివద్దకు బోదము. మీ చేతితో నాతని శిరస్సును దాకి జలమును బ్రోక్షించి యాతనిని, సమస్త జీవులను దరింప జేయుడు.

కరుణాంతరంగితుండగు సునందుడు గ్రామపాలుని వెంట నారాక్షసుని కడ కేగి జలమును గ్రహించి ఏడుమాఱులు గీతయందలి యేకాదశాధ్యాయ పఠనమున నభిమంత్రించి రాక్షసుని శిరమున జల్లెను. తోడనే యా రాక్షసుడును, వానిచే భక్షింపబడిన వేలకొలది జీవులును దివ్య వస్త్రాద్యలంకార భూషితులై, చతుర్భుజులై, శంఖ చక్ర గదా పద్మధారులై దివ్యవిమానముల నధిష్ఠించిరి.

అపుడు పుత్ర వాత్సల్యముచే గ్రామపాలుడు రాక్షసునుద్దేశించి యిట్లు పలికెను—'ఓరాక్షసా! ఇందు నా కుమారుడెచట నున్నాడు ? చూపుమన' 'గ్రామపాల ! దివ్యలక్షణ సంపన్నుండును, చతుర్భుజుండు నగు నాతడే నీ కుమారుడు. అని రాక్షసుడు ప్రత్యుత్తర మిచ్చెను. గ్రామాధికారి కుమా

రుని జూచి కుమారా ! ఇక నింటికి పోదము రమ్ము’ అని పలికెను.

కుమారు డా వచనములు విని తండ్రితో నిట్లుపలికెను— తండ్రీ ! నమస్కారము. ఇదివరలో నీవు నా కెన్నిమాఱులు పుత్రుడవైతివో యెఱుంగుదువా ? నేను నీకు ప్రథమమున గుమారుడనై యిపుడు దేవత్వము నొందితిని. ఈ బ్రాహ్మణుని యనుగ్రహమువలన వైకుంఠమునకు బోవుచుంటిని. ఈ రాక్షసుడు కూడ దివ్యదేహధారియై వైకుంఠమునకరుగుచున్నాడు. కావున నీవుకూడ నీ బ్రాహ్మణునివలన నేకాదశాధ్యాయము నుపదేశమంది నిత్యము పారాయణము చేయుము. ఇందువలన నీవుకూడ నిస్సంశయముగా నుత్తమగతిని బొందగలవు.

తండ్రీ ! మానవులకు సాధుజన సాంగత్యము లభించుట కడు దుర్లభము. అట్టి సాంగత్యముకూడ నీ కిపుడు లభించినది. దానివలన నీ యభీష్టము తప్పక లభించును. ధన భోగ యజ్ఞ దాన తపంబులవలన నేమి ప్రయోజనము? విశ్వరూపాధ్యాయ పారాయణమువలన పరమకల్యాణప్రాప్తి కలుగును. పూర్ణానంద సందోహ స్వరూపుం డగు శ్రీకృష్ణ పరమాత్మ కురుక్షేత్రమం దాతని మిత్రుడగునర్జునున కమృతోపదేశము చేసెను. పరతత్త్వ స్వరూపుండగు శ్రీకృష్ణుని సదా ధ్యానము సేయుము. అదియె మోక్షసిద్ధికి నుత్తమ రసాయనము. ఇందువలన సాంసారికబంధ విముక్తి, ఆధివ్యాధి వినాశనము, జన్మరాహిత్యము దప్పక గలుగును.

పార్వతీ! అతడు తండ్రితోడ నిట్లు పలికి పిమ్మట నందఱును గలిసి వైకుంఠమును బొందిరి. ఆ గ్రామాధికారియు నా సునందుని వలన గీతయందలి యేకాదశాధ్యాయము నుపదేశమంది నిత్యము పారాయణ జేసి యంతమునకు బరమపదము నొందెను.

కావున యేకాదశాధ్యాయము ననవరతము పారాయణము జేయుటవలన కాలధర్మము నొందినవాడు జీవించుట, సర్వపాపములనుండి విడువబడుట, రాక్షసత్వమునుండి విముక్తి బొందుట, తుదకు వైకుంఠమును జేరుటయు సంప్రాప్తించును.

—♦—

# గీతాప్రతిభ

## ద్వాదశాధ్యాయము

పర్వతనందినీ ! ద్వాదశాధ్యాయ మాహాత్మ్యమును జెప్పుచుంటిని. అవధరింపుము.

దక్షిణ దిశయందు కొల్హాపుర మను నొక నగర ముం డెను. ఆ పట్టణము సర్వవిధముల సుఖవంతమైయున్నది. అందు సిద్ధులు నివసించుచుండిరి. ఆ పురముసిద్ధిప్రాప్తికి స్థానమై యల రారుచుండెను. పరాశక్తి యగు లక్ష్మి సదా యందధి వసించు చుండును. ఇటు లా నగరము పురాణప్రసిద్ధమై తీర్థమునకు, భోగమునకు, మోక్షమునకు సాధనభూతమై వెలయుచుండెను. కోటి తీర్థములు, కోటి శివలింగములుకూడనందు కలవు. ఆ నగ రము లోకమున మిక్కిలియుత్తమనగర మని ప్రఖ్యాతి వహిం చెను. ఒకదినమున నొక రాజకుమారు డప్పురమునకు వచ్చెను. అతడు సాముద్రికశాస్త్రప్రకారము సర్వలక్షణ లక్షితుండై యత్యంతసుందరాకారుడై యొప్పుచుండెను; ఇట్లతడునగరసౌభా గ్యమును దిలకించుచు బరాశక్తియగు లక్ష్మినిజూడదలంచిమణి కంఠతీర్థమందు స్నానముజేసి సంధ్యావందనంబును, దేవ పితృ తర్పణంబులను నిర్వర్తించుకొని పిమ్మట లక్ష్మి దేవిని సందర్శించి నమస్కరించి భక్తిపూర్వకముగా నిట్లుస్తుతించెను.

తల్లీ ! నీ వపార దయ కలదానవు, సదా సమస్తప్రాణుల కోర్కెలను దీర్చుచుందువు. నీ కటాక్ష వీక్షణ మాత్రముననే

సృష్టి స్థితి లయంబులు జరుగుచున్నవి. జగన్మాతా! నీకు నమస్కారము. నీ యాజ్ఞను గైకొనియే బ్రహ్మ విష్ణు రుద్రులు సృష్టి స్థితి సంహారములం జేయుచుందురు. మహాలక్ష్మీ! ఎల్లపుడు నేను నిన్నే భజించెదను. హే కమలే! యోగీశ్వరు లందఱు సర్వకాలములందును నీ చరణారవిందములనే సేవించుచుందురు. నీ సంకల్పమాత్రముననే సర్వము జనించుచున్నది. నీవు ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తిస్వరూపురాలవు. పరమ జ్ఞానపూర్ణంబగు నీ యాకారము నిష్కలంకము. నిర్మలము, నిత్యము, నిరంజనము, అంతరరహితము, నిర్భయము, ఆధారశూన్యము నిరామయము నై యున్నది. దేవీ! నీ మహిమ నెవరువర్ణింపగలరు? నీ వనాహత ధ్వని మయివి, బిందు నాద కలాస్వరూపురాలవు. మాతా! నీకు నమస్కారము. తల్లీ! షోడశకలా పరిపూర్ణంబగు నీ ముఖారవిందమునుండి యమృతము వర్షించుచుండును. పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ మొదలగుశక్తులు నీముఖము నుండియే జనించినవి. దేవీ! జగమును రక్షింప నీ వనేక రూపములను దాల్చుచుందువు. అంబికే! నీవు బ్రాహ్మీ మాహేశ్వరీ వైష్ణవీ శక్తిస్వరూపురాలవు. వారాహీ, మహాలక్ష్మీ, నారసింహీ, ఐంద్రీ, కౌమారీ, చండిక, లక్ష్మీ యను నవన్నియు నీ స్వరూపములే. సావిత్రీ! చంద్రకళా, రోహిణి సర్వమునునీవే. నీవు భక్తులపాలిటి కల్పవృక్షమువు. నన్ననుగ్రహింపుము.

ఇట్లు స్తుతించిన పిమ్మట నా రాజకుమారుని యెడదయ గలిగి మహాలక్ష్మి ప్రత్యక్షమై 'రాజపుత్రా! నీ భక్తికి మెచ్చి

తిని. ఇచ్ఛవచ్చిన వరమును దేనినైన కోఱుకొనుము. ఇచ్చె దను' అని పలికెను.

అప్పుడు రాజకుమారు డిట్లు చెప్పసాగెను — మాతా! నా తండ్రి యగు బృహద్రథు డశ్వమేధ యాగము జేయుచు దైవవశమున రోగగ్రస్తుడై స్వర్గమును బొందెను. యూప స్తంభమందు బంధింపబడిన యశ్వమును భూ ప్రదక్షిణార్థమై పోయి యొకచో రాత్రిసమయమున దాటిని దెంపుకొని యెటకో పాఱిపోయెను. సంరక్షణార్థమై పోయిన సైనికు లందఱు దాని సంతటను గలయ వెదకి యెచటను గానక నిరాశులై తిరిగి వచ్చిరి. అపుడు ఋత్విక్కుల యాజ్ఞను గైకొని నేను నిన్ను శరణుబొందుటకై యిటకు వచ్చితిని. తల్లీ! నీవు నా యెడ ప్రసన్నురాలవై యజ్ఞాశ్వమును లభింప జేసినచో యాగము పూర్తి యగును. నేనును బితృఋణ విముక్తుడ నగుదును. కావున నో జగజ్జననీ! నీవు నా యందు గరుణ బూని యాగము పూర్తి యగు నుపాయ మెద్దియైన సెలవిమ్ము.

రాజపుత్రుని వచనంబుల నాలించి లక్ష్మి యిట్లు పలి కెను.—'రాజకుమారా! నాయీ యాలయద్వారమందొక బ్రాహ్మణుడు వసించు చుండెను. జను లందఱు నాతనిని సిద్ధ సమాధి యని పిలుచు చుందురు. అతడు నీ యభీష్టమును బూర్తిగావింపగలడు. కావున నీ వాతని యొద్దకు బొమ్ము' అని పలికి లక్ష్మి యంతర్ధాన మొందెను.

రాజకుమారుడును, అట్లె సమాధిమగ్నుడై యున్న యాబ్రాహ్మణుని వద్దకు బోయి నమస్కారము చేసి నిలచి

యుండెను. వెంటనే యాబ్రాహ్మణుడు రాజకుమారుని జూచి 'రాజపుత్రా! జగన్మాత యగు లక్ష్మి నిన్నిటకు బంపినది. కావున నీ యభీష్టమును నెరవేర్చెదను. జూడుము' అని పలుకుచు మంత్ర ప్రభావము వలన దేవతల నందఱి నచటకు రావించెను. దేవత లందఱు జేతులు జోడించి బ్రాహ్మణుని యాజ్ఞకొరకు నిరీక్షించుచుండిరి. అపుడు బ్రాహ్మణుడు దేవతలతో 'దేవతలారా! ఈ రాజకుమారుని యజ్ఞాశ్వమును రాత్రి సమయమున నింద్రు డపహరించెను. కావున మీరిపుడు పోయి యా యశ్వము నిటకు గొనితెండు' అని యాజ్ఞాపించెను. తోడనే దేవత లాయశ్వమును గొనితెచ్చి రాజకుమారుని కిచ్చిరి. రాజకుమారు డది చూచి విస్మితుడై బ్రాహ్మణునితో నిట్లు పలికెను.

మహర్షీ! తమ యీ సామర్థ్యమునుజూడ నాకెంతయో యాశ్చర్యము కలుగుచున్నది. భూసురవరా! అశ్వమేధము జేయ నారంభించి దైవనియోగమున నా తండ్రి మృతి బొందెను. మే మాతని దేహము నొక తైలపాత్రయం దుంచి కాపాడుచుంటిమి. కావున నో సాధుశీలా! మీరు నాయందు గరుణవహించి నాతండ్రిని పునరుజ్జీవితుని గావింపుడు. వాని ప్రార్థనము విని బ్రాహ్మణుడు క్షణకాలము నిమీలితనేత్రుడై చింతించి 'రాజకుమారా! అట్లైన యజ్ఞవాటికకు బోదము రమ్ము' అని పలికెను. సిద్ధసమాధియు, రాజకుమారుడును, గలసి యజ్ఞవాటికకు బోయిరి. అపుడు సిద్ధసమాధి చేత జలమును గ్రహించి యభిమంత్రించి బృహద్రథుని దేహమందు జల్లెను. వెంటనే బృహద్రథుడు సజీవు డయ్యెను.

అపుడు రాజకుమారుడు జరిగినవృత్తాంతమంతయు దండ్రి కెఱిం
గించెను.అదివినిబృహద్రథుడు నమస్కరించి బ్రాహ్మణోత్తమా!
ఏ పుణ్య ప్రభావమువలన మీ కిట్టి యలౌకిక శక్తి లభించినది?
అని ప్రశ్నించెను. దయామయు డగు బ్రాహ్మణు డప్పు డిట్లు
బలికెను.

రాజా ! నేను ప్రతిదినము శ్రీమద్భగవద్గీత యందలి
ద్వాదశాధ్యాయమును బారాయణ జేయుచుందును.అందువలన
నా కీ యలౌకిక ప్రభావము లభించినది. ఆ ప్రభావము చేతనే
నిన్ను బ్రతికించ గలిగితిని. ఈ వాక్యములను విని బృహద్రథ
మహారాజు, నాతని కుమారుడును గూడ నా బ్రాహ్మణునివలన
ద్వాదశాధ్యాయము నుపదేశ మొంది మువ్వురు గలసి యేకకంఠ
ముతో బారాయణ జేసిరి. అంతమున నా మువ్వురు ద్వాదశా
ధ్యాయ పారాయణమువలన బరమపదము బొందిరి.వారినిజూచి
పౌరులందఱు గూడ నట్లే యాచరింప మొదలిడిరి.

కావున పార్వతీ ! ఈ పండ్రెండవ యధ్యాయమును
నిత్యము పారాయణ జేయుటవలన నవశ్యముగా దేవతాసాక్షా
త్కారము, మృతసంజీవనిశక్తియు, సద్గతియుగూడ లభించును.

—o—

# గీతా ప్రతిభ

## త్రయోదశాధ్యాయము

పార్వతీ! త్రయోదశాధ్యాయ మాహాత్మ్యమును జెప్పు చుంటిని. నిశ్చలమానసవై యాకర్ణింపుము. దీనిని శ్రవణము జేయుటచే నంతఃకరణము పవిత్ర మగును.

దక్షిణ దిశయందు తుంగభద్రానదీ తటమున హరిహర పుర మను నగర ముండెను. హరిహరుడను భగవంతు డప్పుర మున కధిష్ఠాన దేవుడై యుండెను. అతనిని సందర్శించిన మాత్రముననే పరమకల్యాణ ప్రాప్తి కలుగును. ఆనగరమందు హరి దీక్షితుండను నొక శ్రోత్రియ బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. అతఁడు వేదవేదాంతపారగుఁడు, తపశ్శాలి, విద్వాంసుఁడు నై యుండెను. అతనికి దురాచారిణియు, కుత్సితభాషిణియు నగు భార్య కలదు. ఆమె సదా పతిని, పతియొక్క బంధుజనంబును కుత్సితవచనంబులచే దూషించుచుండును. ఆమె నిరంతరము కామోన్మత్తయై వ్యభిచరించుచుండును. ఇటులుండ నొకనాఁడు గ్రామమంతయు జనసంకులమై యుండుటచేత నామె యొక యరణ్యమును దనకు సంకేతస్థలముగా నొనర్చుకొనెను. ఆ నాటి రాత్రి కాముకు డొకఁడైన నా యరణ్యమునకు బోలేదు. ఆమెయు రాత్రి తాను నిశ్చయించుకొనిన యరణ్యమునకు బోయి కామోన్మత్తయై ప్రతి లతా గృహమందును బ్రతి వృక్షచ్ఛాయ యందును వెదకి వనమంతయు గలయదిరిగి యెచటను

పే యొక విటునీ గానక వివిధప్రలాపములాడుచు విసిగి వేసారి యొక లతాగృహమందు గూర్చుండెను. ఆమె ప్రలాపంబులను విని యచటి గుహయందుండి యొక వ్యాఘ్రము గర్జించుచు నీవలకు వచ్చెను. వ్యాఘ్రగర్జనమును విని యామెయు దన విటు డెవడో వచ్చుచుండెనని దలంచి యాలతాగృహమునుండి బయటకు వచ్చెను. తోడనే వ్యాఘ్రమామెపై బడి గోళ్ళచే జీరి చంపివేయుచుండ నామె గంభీరముగా "నో వ్యాఘ్రమా ! వ్యర్థముగ నీవు నన్నేమిటకు జంపుచుంటివో, యెఱుంగజేసి పిమ్మట నన్ను జంపవలయును. క్షణకాల మాగుము" అని పలికెను.

మిక్కిలి యాకలి గొనియున్న వ్యాఘ్ర మామె వచనములనువిని క్షణకాలమోర్చి మందహాసముతోడ నిట్లు పలికెను — దక్షిణదేశమందు మలాపహా నదీతీరమున మునిపర్ణాపురమను గ్రామ మొకటుండెను. అందు భగవంతుడు పంచలింగేశ్వరు డను పేరుతో విరాజిల్లుచుండెను. పూర్వ మా గ్రామమున నేనొక బ్రాహ్మణ కుమారుడనై జన్మించితిని. నేనా గ్రామమందు యజ్ఞములు సేయించి యందలి కుత్సితాన్నమును భుజించుట. ధనాశచే వేదవిద్యను విక్రయించి యితరభిక్షుకులకు, బండితులకు గూడ నాధార మేమియు లేకుండ జేయుట, అన్యాయార్జనము జేయుచు నితరులవద్ద ఋణమును జేయుచుండుట మున్నగు చెడ్డపనుల నాచరించుచు గాలము గడపుచుంటిని. ఇటులుండ గ్రమముగా వార్థక్యము సమీపించుట తల నెరసిపోయి, దంతము లూడి పోయినవి. ఇంద్రియ పటుత్వ మంతరించినది.

దేహము ముడుతలువడియెను. ఇట్లు కాలముగడచుచుండ నేనొక పర్వదిన మందొక తీర్థమునకు బోయి యచట ధూర్తులగు బ్రాహ్మణుల నాహారమును యాచింపదలచి వారివద్దకు బోవు చుంటిని. ఇంతలో నొక శునకమువచ్చినన్ను గఱచెను. తోడనే నేను మూర్ఛ జెంది భూమి మీద బడిముహూర్త కాలమందే మృతి బొందితిని. పిమ్మట యమదూతలచే యమలోకమునకు గొంపోబడి యనేక యాతనల ననుభవించి తిరిగి యిట్లువ్యాఘ్రము నై జన్మించితిని. నాటినుండియు నీయరణ్యమందువసించుచు బూర్వస్మృతి గలిగియుంటచే సాధువులను, యతులను, బతివ్రత లను జంపక దుష్టులను, బాపాత్ములను, కులటలనుజంపిభక్షించు చుంటిని. ఇపుడు నీవు కులటవు కావున నాకాహారమ వైతివి. ఇట్లు పలికి వ్యాఘ్ర మామె దేహమును జీల్చిభక్షించివైచెను.

తత్‌క్షణంబ యమదూతలు వచ్చి యామెను యమ సన్నిధికి గొంపోయిరి. అనంతరమున నామె పాపకృత్యంబులను సాంతముగ విచారణజేసి కోటి కల్పములు, నూరు మన్వంత రములు గడచువరకామెను దహన మను నరకమందు బడ ద్రోసి యనేక యాతనల ననుభవింపజేసిరి. పిమ్మట మఱల నామె భూమియందు జండాలస్త్రీయై యుద్భవించెను. పూర్వ కర్మవాసనచేత నామె చండాలస్త్రీ యయ్యు జారత్వము నాచరించుచునే యుండెను. ఇట్లు కొంతకాలము గడువగా నామెకు రాజయక్ష్మ వ్యాధి, నేత్రరోగము నుద్భవించెను. ఆ వ్యాధులచే బీడితురాలై యామె దన జన్మస్థానమునకు వెడలిపోయెను. అచట జంభకాదేవితో విరాజమానుడై పర

మేశ్వరుడు వసించు యాలయమున వాసుదేవుండను బ్రాహ్మణుడు నిత్యము ఆ పరమేశ్వర సన్నిధిని గీతయందలి త్రయోదశాధ్యాయమును పారాయణ జేయుచుండెను. ఆమెయు నచటకు బోయి యా బ్రాహ్మణునిచే బఠింపబడు త్రయోదశాధ్యాయమును శ్రవణము జేసెను. తోడనే చండాలదేహమును వీడి దివ్యదేహమును ధరించి యామె విమానము నధిష్ఠించి దేవతలచే సేవింపబడుచు నుత్తమలోకమును బొందెను.

కావున నీ త్రయోదశాధ్యాయమును భక్తితో పారాయణ జేయువారును, విన్నవారును జన్మజన్మాంతర పాపవిముక్తులై చండాలత్వము పోయి ఉత్తమగతులను బొందుదురు.



# గీతా ప్రతిభ

## చతుర్దశాధ్యాయము

పర్వతపుత్రీ! ఇపుడు భవబంధములను బాపుకొనుటకు ప్రధానసాధనంబగు బదునాలగవ యధ్యాయ మాహాత్మ్యమును జెప్పుచుంటిని. ధ్యానముతోడ నవధరింపుము.

పూర్వము పరమతేజశ్శాలియగు శౌర్యవర్మ యను భూపాలుడు కాశ్మీర మండలమును పాలించుచుండెను. ఆ కాలమందే సింహళ ద్వీపమును సింహపరాక్రముండగు విక్రమవేతాలు డను మహారాజేలుచుండెను. వీరిద్దఱకు విశేషముగా మైత్రి కలదు. ప్రేమవశమున నొకనాడు శౌర్యవర్మ తన మిత్రుండగు విక్రమవేతాలునకై రెండు ఆడ కుక్కలును గానుకగా బంపగా విక్రమవేతాలు డాకుక్కలను గ్రహించి మఱల మదపుటేనుగును, అశ్వమును, మణిభూషణాదికములను దనమిత్రునకు గానుకగ బంపెను. విక్రమవేతాలు డొకనాడు రాజకుమారులతో గూడి యాడకుక్కలను వెంటబెట్టుకొని వేటకు బోయెను. క్రమముగా వనమందు బ్రవేశించి యారాజు మిక్కిలి వేగముగా బరుగిడుచు బారిపోవుచున్న కుందేలు నొకదానిని జూచి దానిని బట్టుకొనుటకై తన కుక్క నొకదానిని విడిచిపెట్టెను. అట్లా కుందేలు బోయిపోయి యొక గోతియందు బడి తిరిగి లేచి పరుగిడుచు పోయి నొక్క ప్రదేశమును బ్రవేశించెను. ఆప్రదేశమందు హరిణములు వృక్షములనీడలందు నిర్భయముగా దిరుగు

చుండెను. మర్కటములసైతము చెట్లనుండి రాలిన ఫలము లనే భక్షించు చుండెను. సర్పములభయమువీడి నెమళ్ళ రెక్కలయందు నిదురించుచుండెను. కరిపోతములు సింహములతోడ నిర్భయముగ క్రీడించు చుండెను. ఆ సమీప మందొక యాశ్రమమున జితేంద్రియుం డగు వత్సమునీశ్వరుడు వసించు చుండెను. ఆతడునిత్యము గీతా చతుర్దశాధ్యాయమును పారాయణ జేయుచు శిష్యులకు గూడ నుపదేశించుచుండెను. అమ్ముని శిష్యుడొక నాడా యాశ్రమాంగణమున పాదప్రక్షాలనము జేసి కొనగా నాజలముచే నచట భూమి బురదయై యుండెను. తరుమబడుచున్న శశక మాప్రకారముగా బరుగిడుచు వచ్చి యలసి యాబురద యందుబడెను. ఆమునిశిష్యుని పాదప్రక్షాలనోదకమును దాకగనే కుందేలు తన దేహమును విడచి, దివ్యరూపమును ధరించి, దివ్యవిమానము నధిష్ఠించి దివికి బోయెను. ఆ శశకమును వెంబడించి పరుగిడుచు వచ్చిన యాడుకుక్కయు దైవవశమున నాపాదప్రక్షాలన జలబిందువుల తనపై బడుటచే నా దేహమును త్యజించి దేదీప్యమానంబగు నొక దివ్యగంధర్వ స్త్రీరూపమును ధరించి యఖిల గంధర్వులచేతగీర్తింప బడుచు దివ్య విమానము నధిరోహించి స్వర్గమునకు బోయెను.

ఆ సమయమున వేతాలు డటకువచ్చి యా సమాచారంమంతయు జూచి యమ్ముని కుమారునకు బ్రణమిల్లి యిట్లు ప్రశ్నించెను — మహాత్మా ! "పశుయోనులందు జన్మించి యజ్ఞానముగా బ్రవర్తించు నీ యాడుకుక్కయు, కుందేలును, దివ్యరూపములను ధరించి యుత్తమ గతిని బొందుటకు గారణ

మేమి? ఈ వృత్తాంతమునువిన నా కెంతయో కుతూహలముగా నున్నది. కావున ననుగ్రహించి యెఱుగజేయుడు.

అపు డా మునిశిష్యు డిట్లు పలికెను— రాజా! ఇయ్యాశ్రమమందు జితేంద్రియుండగు వత్స మునీంద్రుడు నివసించు చుండెను. ఆయన నిత్యము గీతాచతుర్దశాధ్యాయమును భక్తితో పారాయణ జేయుచు మాకు గూడ నుపదేశించు చుండును. నేను వారికి శిష్యుడను. నేనుకూడ వారి యాజ్ఞానుసారముగ గీతా చతుర్దశాధ్యాయమును పారాయణ జేయుచుందును. నే నింతకు బూర్వ మిచట పాదప్రక్షాలనము జేసికొంటిని. నిత్యము జతుర్దశాధ్యాయమును బఠించుచుంటచే బరమపూతమగు మదీయ పాదోదకమందు బడి యీకుక్కయు, కుందేలును బరమపదమును బొందినవి.

రాజా! ఈ శునీ శశకంబుల పూర్వవృత్తాంతమును గూడ జెప్పెద నాకర్ణింపుము — పూర్వకాలమందు మహారాష్ట్రదేశమున బ్రత్యుదక మను నొక గ్రామముండెను. అందు గపటశీలుండగు కేశవుడను నొక బ్రాహ్మణు డుండెను. అతనికి దుశ్శీల యగు విలోభన యను భార్య కలదు. ఆమె కామోన్మత్తయై స్వేచ్ఛగా విహరించుచుండ కేశవుడు కోపము జెంది యేకనా డామెను వధించెను. ఆ స్త్రీహత్యాపాతకంబువలన నా బ్రాహ్మణు డిట్లు శశకమై జన్మించెను. ఆమెయు నాడుకుక్కయై జన్మించినది.

ఈ కథనమంతయు విని రాజు ఆశ్చర్యచకితుడై యమ్మునివలన దాను గూడ గీతా చతుర్దశాధ్యాయము నుప

దేశమందెను. నాటినుండియు భక్తితో జతుర్దశాధ్యాయమును బారాయణ జేసి వేతాలుడు కూడ నంతమునకు మోక్షమును బొందెను.

కావున నీ పదునాలుగవ యధ్యాయమును బారాయణ జేయుటచే మానవులు స్త్రీహత్యాపాతకము, జారత్వదోషము మున్నగు పాతకముల నశింపజేసికొని యుత్తమగతులను బొందుదురు. ఇందెంతమాత్రమును సందియములేదు.



# గీతా ప్రతిభ

## పంచదశాధ్యాయము

గిరినందినీ! పరమ పవిత్రంబగు బంచదశాధ్యాయమును వివరించుచుంటిని. సాదరముగ నాకర్ణింపుము.

పూర్వము గౌడదేశమును కృపాణనరసింహుడను రాజు పాలించుచుండెను. ఆతనివద్ద మిక్కిలి బరాక్రమశాలి యగు సేనాపతి యొకడు గలడు. అతడు యుద్ధమందు దేవతలను గూడ జయించు పరాక్రమము కలవాడు. సర్వకళాకుశలుండగు నాతనిని జనులు సరభభేరుండు డని పిలుచుచుందురు. ఒకనా డాతని మనమందు 'పుత్రసహితముగా నారాజును జంపివైచి యా రాజ్యమును దాను స్వీకరింపవలయు' నను దుర్బుద్ధి జనించెను. తన యభీష్టము సిద్ధింపకుండగనే దైవవశమున నాతడు మృతి బొందెను. అట్లు మృతి బొంది పూర్వకర్మానుసారముగా నాతడు సింధు దేశమున మిక్కిలి తేజోవంతమైన యశ్వమై జన్మించెను. ఆ యశ్వమును గౌడదేశమందలి వైశ్యుం డొక డనేకరత్నముల నిచ్చి కొని తన గ్రామమునకు గొనిపోయి యటనుండి కృపాణనరసింహుని యాస్థానమునకు దీసికొనిపోయెను. భటులీ వృత్తాంతమును రాజునకు నివేదింప నత డాయశ్వమును అశ్వశాస్త్రవేత్తలచే బరీక్షింపజేసి సర్వలక్షణ సంపన్నంబై యుంటచే వైశ్యున కవంత ధనము నిచ్చి యా యశ్వమును

దానుగ్రహించెను. యథార్థమందాయశ్వము ఉచ్చైశ్రవమును మించిన లక్షణములు కలిగియుండెను.

ఇటులుండ నొక నాడు కృపాణ నరసింహుడాయశ్వము నధిష్ఠించి వేటకు బోయెను. ఆ యశ్వము మిక్కిలి వేగశాలి యగుటచే సైన్యమును వెనుక విడచి తాను ముందుగ బోయి యరణ్యమున ప్రవేశించెను. అందా రాజు చాల దూరప్రయాణము జేసి మిక్కిలి దప్పి గొనియుండుటచే నొక జలాశయము తటమందు గుఱ్ఱమును డిగ్గి దానినొక వృక్షమున బంధించెను. తానును జలమును ద్రావ నా జలాశయమునకు బోవుచు బ్రమాదవశమున గాలుజాఱి యొక రాతి మీద బడెను. అచట నొక యూకు మీద శ్రీమద్భగవద్గీతా పంచదశాధ్యాయమందలి యర్థ శ్లోక భాగము వ్రాయబడి యుండెను. దాని నా రాజు చూచి విశదముగా జదివెను. ఆ పరమాక్షరముల నా యశ్వము విని తోడనే తన యీ దేహమును విడిచి దివ్యరూపమును ధరించి రాజు చూచుచుండగనే దివ్యవిమానము నధిరోహించి విష్ణులోకమును బొందెను.

పిమ్మట రాజా శిలావేదికపై గూర్చొని యనతి దూరమున నొక దివ్యాశ్రమమును గాంచెను. రాజు ఆయాశ్రమమునకు బోయి యందు నివసించుచున్న విష్ణుశర్మ యను బ్రాహ్మణుని గనుగొని భక్తితో నమస్కరించి యిట్లు పలికెను.

విప్రోత్తమా ! నేను చూచుచుండగనే నా యశ్వము తన దేహమును వీడి దివ్యదేహమును ధరించి వైకుంఠమును

బొందెను. ఇందులకు గల కారణ మేమి యో, యానతీయ గోరుచున్నాను'. అపుడు త్రికాలవేది యగు విష్ణుశర్మ యిట్లు పలికెను.

రాజా! పూర్వము నీవద్ద సరభభేరుండను సేనాపతి యుండెను. అత డొక సమయమున దుర్బుద్ధిచే బుత్రసహితముగ నిన్ను జంపి యారాజ్యమును దాను గ్రహింపవలయునని తలంచెను. అట్లు తలంచి శుదకాతడే మృతి బొందెను. ఆ దురాలోచన దోషముచేత నాత డిటు లశ్వమై జన్మించెను. ఇపుడు నీచే జదువబడిన గీతా పంచదశాధ్యాయ మందలి యర్థ శ్లోకభాగమును వినుటచేత నీ యశ్వదేహమును విడచి యతడు స్వర్గమును బొందినాడు.

ఇది యంతయు విని రాజు తన పరివారముతో గూడ భక్తిపురస్సరముగా విష్ణుశర్మకు నమస్కారము జేసి, యాతని వలన గీతా పంచదశాధ్యాయము నుపదేశ మందె. యాతని యనుమతిని బొంది తన పురమునకు వెడలిపోయెను. అనంతరమున మంత్రి సమక్షమందు రాజ్యమును దన కుమారుడగు సింహబలునకు బట్టము గట్టి తాను నిత్యము భక్తితో గీతా పంచదశాధ్యాయమును పారాయణ జేయుచు దుదకు మోక్షమును బొందెను.

కావున నీ పంచదశాధ్యాయమును పారాయణ జేయువారును, పశుయోనియందు జన్మించియు శ్రవణము జేయువారును గూడ సర్వపాప విముక్తులై తరించుచురు.

# గీతా ప్రతిభ

## షోడశాధ్యాయము

ప్రేయసీ ! ఇపుడు పరమపవిత్ర మగు షోడశాధ్యాయ మాహాత్మ్యమును జెప్పుచుంటి. సాదరంబుగా నవధరింపుము.

ఘూర్జరమండలమందు పూర్వము సౌరాష్ట్రికమను నొక నగర ముండెను. ఖడ్గబాహుండను రాజా నగరము నేలుచుండెను. ఆతని వద్ద యమితబలశాలి యగు నొక యేనుగు కలదు. ఆ మత్త గజమునకు వారు అరిమర్దన మని పేరు పెట్టిరి. ఒకనా డాగజము గొలుసులను ద్రెంచుకొని యుక్కుస్తంభములను విరుగగొట్టి బజారు వెంట బడియెను. వెంటనే మావటీడు దానిని బంధించుటకై రెండాయుధములను జేత ధరించి గజమును వెంబడించెను. అత డనేక ప్రయత్నములు చేసి దానిని బట్టుకొనలేక భయముచే దూరమునుండి చూచుచు నిలచి యుండెను. ఇంతలో రాజుగూడ నా సమాచారమును విని యచటకు వచ్చెను. తానుగూడ వివిధ ప్రయత్నములు చేసి చూచెను. కాని యా మహాబలము గల మత్తగజము వశము కాలేదు. ఆ సమయమున జనులందఱు నాగజమెవ్వరి నేమి చేయునో యని భయముతో జూచుచుండిరి. ఇంతలో నొక బ్రాహ్మణుడు స్నానముచేసియామార్గమున బోవుచుండెను. పౌరు లాయనను జూచి అయ్యా ! మీరటు పోవలదు. ప్రమాదము వాటిల్లును' అని పలికిరి.

వా రెంత జెప్పుచున్నను లెక్కజేయక నా బ్రాహ్మణుడామార్గ మునసే పోయి నిర్భయముగాగజమునుసమీపించి తన చేతితో దాని శరీరమును నిమురసాగెను. అదిచూచిరాజు, సేవకులు, పౌరులునెంతయో యాశ్చర్యమందిరి. రాజపుడు బ్రాహ్మణుని సమీపించి మిక్కిలి భక్తితోనమస్కరించి 'బ్రాహ్మణోత్తమా! తా మిపుడిట్టిభయంకర గజముతోడ గుశలప్రశ్నలు చేసిగొప్ప యలౌకిక కార్యము నొనర్చితిరి. ప్రభో! తాము ఏ దేవతను గొల్చి యే మంత్రమును జపించి యీ యలౌకికసిద్ధి నిబడసితిరి? అని యడిగెను.

అపుడు బ్రాహ్మణు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను— రాజా! నేను ప్రతిదినమునను శ్రీమద్భగవద్గీతా షోడశాధ్యాయ మును బారాయణ జేయుచుందును. అందువలననే నాకీ సిద్ధి కలిగినది. ఇటులా బ్రాహ్మణుని వచనంబులు విని రాజు వెంటనే గజము నచటనేవిడచి యాయనను దన భవనమునకు గొంపోయెను. ఒక సుముహూర్తసమయమున నతడు లక్ష సువర్ణముద్రలను గొనితెచ్చి యాబ్రాహ్మణునకు గురుదక్షి ణగా నిచ్చి, యాయనవలన గీతాషోడశాధ్యాయమున నుపదేశ ముందెను. నాటినుండియు రాజు ఆ షోడశాధ్యాయము బారా యణ జేయసాగెను. మొదటి దివసమున రాజు ఒక్కశ్లోకము మాత్రమును బఠించి తన యేనుగును జూచు దలంపున గజ శాలకు బోయెను. మావటి వానిచే దాని బంధంబులను దీసి వేయించి యతడు నిర్భయముగా నాగజమును సమీపించెను. బంధములు లేకున్నను నా యేనుగెంత మాత్రము జలింపక మిక్కిలి సాధుభావమును వహించి నిలచి యుండుటను జూచి

